# ఖద్దరు నిర్వచనము

## చరఖా సంఘం ధృవపత్రం బొందని ఖద్దరు ధరించగూడదు

### కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమందలి మొదటి విషయము

(గోలకొండ విలేఖరి)

(మచిలీపట్టణము) టప్పా

డా॥ పట్టాభిసీతారామయ్యగారు ఈక్రింది స్టేటుమెంటును యిచ్చుచున్నారు:—

హరిపుర కాంగ్రెసు జరిగినవెనుక కాంగ్రెసు కార్యసదస్సువారిచే చేయబడిన తీర్మానాలలో అంతగా ముందుకువచ్చి అంతఋనూ లెక్కకెక్కకపోయినా కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంలో రెండు ముఖ్యాంశాలకు సంబంధించిన — జాతీయదిక్కమీద ఒకటి, ఖద్దరుమీద ఒకటి—రెండు తీర్మానాలు చేయబడినవిగదా. వీటిలో ఖద్దరునుగూర్చి ఇప్పుడు తీర్మానించవలసిన అవసరంఏమిటి? అను ప్రశ్న వస్తున్నది.

ఖద్దరు పరిశ్రమలో పనిచేస్తూన్న వడుకు వాండ్రకు ఇతరపనివాళ్ళకుపరిపడు జీతవాలీయదలచి అందువగాను పూనుకొని అ. భా. చరఖాసంఘంవారు అవలంబించిన విధానంపట్ల కాంగ్రెసు కార్యసంఘం ఈతీర్మానమూలంగా తనఅంగీకారాన్ని వెలిబుచ్చుతోంది. చరఖా సంఘముయొక్క ధ్రువపత్రంపొందిన ఖద్దరుచేకొంటూ ఈవిధానంయొక్క సక్రమ నిర్వహణకుతోడ్పడవలసినదిగా కాంగ్రెసీయులను ఈతీర్మానం ఆదేశించింది. ఈ తీర్మానానికి పూర్వగాథ వేరేవున్నదిగాని, తీర్మానంలో వివరింపబడలేదు. తీర్మానానికిముందు ఈ తీర్మానం చేయటానికి కారణమైన సంగతి సందర్భాలేమిటో తెలియజేసే వివరణను చేర్చివుంటే విలువగావుండేది. అసలువిషయమేమిటంటే వాస్తవానికి కొంతకాలంనుంచీ వడుకు మజూరీ చాలాతక్కువగా వున్నదనే ఫిర్యాదు బయలుదేరింది. రోజూ ఎనిమిదిగంటల కష్టానికి ఇచ్చే నాలుగుకానుల మజూరీ ఏమాత్ర గిట్టుబాటుకాకపోవటం అట్లావుండగా నిగ్గుచేటుఅనిన్నీ, అంతేకాక ఈపరిస్థితులుచూచి పిచ్చిలూ వెర్రులూ ఎక్కువవని కాంగ్రెసు ప్రతిపక్షులు కాంగ్రెసును ఎగతాళిచేయడానికి, నిందించడానికి తరవిషయాలతో బాటు ఈవడుకు మజూరీ గూడ ఒకకారణమైనది. వడుకుపరిశ్రమ ఇప్పుడిప్పుడే తేరుకుంటోంది. చేతితోవడికి చేతితో నేసిన బట్టఖరీదు మక్త్రప్రియంగా ఉండగూడదు. ఇచ్చేకూలి డబ్బులెన్ని పనిచేసేది ఎన్నిగంటలకాలము అనేప్రశ్నలు ఈసందర్భంలో పనికిరావు. ఫ్యాక్టరీల విషయంలోను బస్తీ బస్తీ విషయంలోను మాత్రమే యీ ప్రశ్నలవల్ల లాభంవుంటుంది. వడుకు పరిశ్రమఅనేది ఉపవృత్తియేగాని ప్రధానవృత్తికాదు. అదువారికి అందులోను పిన్నవారికి పెద్దవారికి సుష్టుగా వున్నవారికి లేనివారికి ఇంట్లో తీరికగా వడుక్కోవటం సులభసాధ్యమే. ఈసందర్భములో నాలుగుకాన్ల కూలి చాలనూవచ్చును. కాని ఈ పరిశ్రమ నిలువదొక్కుకొని సుస్థాపితమై మన జాతీయ జీవనంలో ఆర్థిక రాజకీయాలలో ప్రధానపాత్ర ధరించినతరువాత మహాత్మ గాంధిగారు ఇంకొకఅడుగు ముందుకువేసి నూలు వడుకువాళ్లకుగూడ చాలినభృతి యుండాలని విధించారు, చరఖాసంఘం తటపటాయిస్తూనే ఈ సిఫారసు నామోదించినది. కొంతకాలం ఈ పద్ధతిప్రకారం పనిచేసి చూసేటప్పటికి ఈసిఫారసుకాక మఱోమార్గంలేదని గట్టినమ్మకం కుదిరింది. ఈకృషికి ఫలితంగానే ఈవాడు ఖద్దరనగా కేవలం చేతితోనేసి చేతితోవడికిన బట్టకాదు, గాంధీజీ సలహానుసరించి చరఖాసంఘం ఏర్పాటుచేసి నిర్ణయించిన మజూరీయే ఖద్దరుకు సంబంధించిన అన్నిపనులలోనూ ఇవ్వబడుతూ తయారైన బట్టమాత్రమే ఖద్దరు అని వెల్లడి అయినది.

ఖద్దరు కీనిర్వచనాన్ని శాసనబద్ధంచేయడం సాధ్యంకాదు కాని ఈహంశం సరిగా మనస్సుకుపట్టించుకోకపోతే చాలినమజూరీ యివ్వకుండానే చేతితోవడికి చేతితో నేసిన ఖద్దరును తయారుచేసే స్వంత ఉత్పత్తిదారులకు ప్రోద్బలమిచ్చినట్లవుతుంది. ఇటీవల ఖద్దరు చట్టమును రెండవసారి ననుసరించి, మద్రాసు, యు. పి. రాష్ట్రాలకుకూడ వర్తింపచేయడం వలన, ధ్రువపత్రం పొందకనే ఖద్దరువ్యాపారం చేసేవారు తమదిన్నీ చేతితోనేసినఖద్దరేనని వాదించటానికి వీలుచిక్కనది. వడుకువారలకు చాలిన మజూరీ యిచ్చితీరవలెనని చరఖాసంఘంపట్టు. కాంగ్రెసు దీన్ని ఆమోదిస్తోంది, కనుక చరఖాసంఘం నిర్ణయించిన మజూరీనిచ్చి తయారుచేసే ఖద్దరే ఖద్దరు. చేతితోనేసిన బట్ట మాత్రమేగాక, చరఖాసంఘంయొక్క ధ్రువపత్రం పొందినదే ఖద్దరు.

ఇంతేగాక. ఖద్దరును తయారుచేయటంలో అంతో యింతో తోడ్పడే ప్రతివాడున్నూ, ఇస్త్రీచేసే రజకుడు,రంగిరేజు, సహా, ప్రధానంగా వడుకువారున్నూ ఖద్దరు విధిగాధరించి తీరవలెనే నియమమొకటి చరఖాసంఘ నియమావళిలో కలదు; ఎందుకనగా తామువడికిన నూలును అమ్ముకొని జీవించు వడుకువారే, మిల్లుబట్టను ధరింపసాగితే అసలు ఉద్దేశ్యానికే భంగం కలుగుతుంది. అందుచేతనే ఖద్దరు ఉత్పత్తికి ఏదశలో ఏతీరున సాయపడే వారైనప్పటికీ ఖద్దరు ధరింపజేసినందుకు ప్రయత్నాలు జరుగుతున్నవి. ఈఖద్దరు ఉద్యమానికి యిదే ప్రాణమూ, ఆయువుపట్టూను. స్వంత ఉత్పత్తిదార్లకు ధ్రువపత్రాలివ్వటంలో ఈ నియమం తు, చ, తప్పకుండ పాలింపబడుతున్నది. అవతలివారున్నూ పాటించేట్లు చూడబడుతున్నది. మఱి ధ్రువపత్రంపొందని ఖద్దరుకు ఎంతభేదమున్నదీ ఈకరపత్రం చదివితే బోధపడకమానదు.

ఈపనిలోపడిపోళ్ళనుంచి మెలుగుతూవున్న వారికి యితరులకు. స్వంతఖద్దరు వ్యాపారులకు ఈనియమాలవల్ల కొద్దిగా యిబ్బంది కలిగిస్తుంటుంది, ముఖ్యంగా కాంగ్రెసు ప్రభుత్వభారంపైన వేసికోవటంతోబాటు ఖద్దరుకుగిరాకీ విశేషంగా ఉండటంవలన ఈమొదలైన ఉత్పత్తిదారందరూ యీమజూరీ నియమాలనుగాని చరఖాసంఘముయొక్క యితర నియమాలనుగాని పాటించకయే తమతమసరుకును బజారులోకి దిగుమతిచేస్తున్నారు. చరఖా సంఘం వీరిబట్టకు ధ్రువపత్రమివ్వనప్పుడు కొన్నికొన్ని సమయాలలో వీరు తమశక్తికి తగని తీరనిఅవమానం జరిగినట్లుగా భావిస్తారు,తమదిపూర్తిగా చేతితో వడికి చేతితో నేసిన బట్టయినప్పటికి తమకు చరఖాసంఘం ప్రోత్సాహమిచ్చుట లేదని వీరు ఘోషిస్తారు. చరఖాసంఘం ధ్రువపత్రమివ్వకపోవడానికిగాని కారణమేమిటంటే అ. భా. చ. సంఘము వారి నిబంధనలననుసరించకనూ అనేక సందర్భాలలో చరఖాసంఘంఇస్తున్న హెచ్చు మజూరీననుసరించి ధరలను బట్టి బట్టలధరలు నిర్ణయిస్తూ నిర్ణీతభృతిని పనివారలకీయకుండానున్నూ ఆనియమాలను పాటించకుండాను లాభం కొల్లగొనుతూవుండటమే. ఇంతవరకు కాంగ్రెసు తీర్మానాలలో సాధారణం: ఖద్దరునుగురించిన ప్రస్తావనమాత్రమే యున్నదిగాని, ధరించవలసిన ఖద్దరునుగూర్చిన నిర్వచనమేమిన్నీ లేదు. ఈతీర్మానము ననుసరించి ఇకనుండి ప్రతి కాంగ్రెసీయుడున్నూ ఖద్దరుమాత్రమేగాక ధ్రువపత్రము పొందిన ఖద్దరునే వాడవలసియుంటుంది.

ఖద్దరుకు గిరాకీ నానాటికి వృద్ధిపొందుతూవుండటంవలన,ధృవపత్రంపొందిన స్వంత ఉత్పత్తిదారులనేకులు ఖద్దరుకగుచున్న గిట్టుబడిమూలాన విశేషంగా లాభంపొందేందుకు తమసరుకును ప్రచారంచేసుకుంటూవుండడమే ఈతీర్మానానికి మూలకారణమైనది. దుకాణములకు ధ్రువపత్ర మిచ్చుటకున్న నియమములు నిబంధనలు సడలించటానికి వీలులేనివి. ఉదాహరణకు రాం చేరకుండాని అప్పుపెట్టడానికి కుతరాఖమూ వీలులేదు. కొన్నసరుకుకు వెంటనే డబ్బు యిచ్చి తీరవలెననేనియమం చాలామందికి ఇబ్బందిగా వుంటుందని మనకు తెలుసును. అందులోను పేదవారైన కాంగ్రెసీయులకు మరింత యిబ్బందిగావుంటుందని మనకుతెలుసు. కొఖ్యాం బేరాలనుపన్నుగా భావిస్తారువీరు.అందుచేత వీరినియమాన్ని త్రోసిపుచ్చి, అప్పు యిచ్చి, బహుశః తక్కువకూలి యిస్తూవుండటంవలన కొన్ని చౌకగాగూడ అమ్మే దుకాణాలలో వీరు బేరసారాలు చేస్తూవుంటారు. దేశభక్తిమున్నగు హంగాలలో యితరులవలెమాత్రమూ తీసిపోని కాంగ్రెసు వాదులున్నూ ఇటువంటి సందర్భాలలో ధ్రువపత్రంపొందనిబట్టనే ఖరీదు చేస్తూవుండటం సంభవిస్తోంది.

కనుక యీతీర్మానం తరుణంలోనే చేయబడినది, "ఖద్దరు" అనే పదానికి అర్థము వివరించుకట్టే నియమ నిబంధనలకు ఈ తీర్మానము ఒకవిశ్వమైన సంబంధము సందర్భశుద్ధి కలిగించుచున్నది. నిజానికి "ఖద్దరునుగూర్చిన ఉచితమైన వివ్వచనముతోసమే ఈతీర్మానము ఘోషిస్తున్నది. కనుక యిహమంచీయైనా కాంగ్రెసు సభ్యులు కాంగ్రెసువ్యక్తులే ధ్రువపత్రం పొందని ఖద్దరును వాడుతున్నారుఅనే అపవాదుకు ఎడమీయకుండా ఈ తీర్మానాన్ని మనస్సులోపెట్టుకొని కాంగ్రెసువారు అందరూ ప్రవర్తించడం భావ్యంగా వుంటుంది.


గోలకొండపత్రిక

(జాతీయ అర్ధవారపత్రిక)

హైదరాబాదు

చందా వివరములు

సంవత్సరమునకు రు ౭-లు

అర్ధసంవత్సరమునకు రు ౪లు

విడిపత్రిక ౧ అణా

## వార్షికోత్సవమునందు వక్తృత్వ పోటీపరీక్షలు

(ఒక విలేకరి)

మహబూబునగరం మార్చి ౧౭

మార్చి ౧౦ వ తేదిన ఆంధ్రబాలసంఘ ప్రథమవార్షికోత్సవము సంయుమందిరమునందు విఖ్యాతి అంధయుఫక నాయకులగు శ్రీ నందగిరి వెంకటరావు బి ఏ ఎల్ ఎల్, బి. గారి అధ్యక్షత క్రింద జయప్రదముగా జరిగినది. సభయందు ప్రభుత్వోద్యోగులు, జిల్లాలోని అంధ్రప్రముఖులనేకులు పాల్గొని సభ్యుల ప్రోత్సాహపరచిరి కార్యదర్శిగారు నివేదిక చదివిన పిమ్మట వక్తృత్వపోటీపరీక్షలు జరిగినవి. ఆంధ్ర భాషయందు జరిగినవాటిలో శ్రీ వెంకన్న గారికి మొదటి బహుమానము, శ్రీ సంగూర్కు సీతరామరెడ్డి గారికి రెండవ, గోపాలరావు గారికి మూడవ బహుమాన మొసగబడెను.

ఉర్దూభాషయందు శ్రీ బుచ్చయ్య, వెంకన్న, గోపాల్ రావు గారలు, అంగ్లమునందు వద్ది వెంకటరెడ్డి, లక్ష్మీకాంతరావు బాలరెడ్డి గారలకు క్రమముగా మొదటి, రెండవ, మూడవ బహుమానము లొసగబడినవి

"మనము ఆంధ్రులము, ఆంధ్రభాష, ఆంధ్ర సంస్కృతి అభివృద్ధికి కృషిసల్పుటయే మన ముఖ్యకర్తవ్యము జాతీయాభిమానము ప్రజలలో పుంజీభవింపజేసి ఆంధ్రయశశ్చంద్రికలతో దేశమును తేజోవంత మొనరింపవలయునని అధ్యక్షులు బోధించిరి. శ్రీరామశాస్త్రిగారు సహితము సభ్యులకనేకవిషయములు బోధించిరి.

## రైల్వే రాకపోకలు

H. E. H ది నైజామ్స్ స్టేటు రైల్వే

(పెద్దలైను)

### చేరుట

| | సికింద్రాబాదు, (బి.జి.) గం.ని. | హైద్రాబాదు. గం.ని. |
|---|---|---|
| నం. 11 ఖాజీపేట-హైద్రాబాద బి జి ప్యాసింజరు | 6-26 | 7-1 (బి) |
| నం. 2 వాడీ-బెజవాడ ప్యాసింజరు | 7-52 | 8-26 |
| నం. 1 బెజవాడ హైద్రాబాద ప్యాసింజరు | 15-0 | 15-41 (ఎ) |
| నం. 10 ఢిల్లి విజయవాడ్-సికింద్రాబాద ప్యాసింజరు | 20-30 | 2-1 |

### వెళ్లుట

| | | |
|---|---|---|
| నం. 9 సికింద్రాబాద-ఢిల్లి విజయవాడ్ ప్యాసింజరు | 7-20 | 7-56 |
| నం 2 వాడి-బెజవాడ ప్యాసింజరు | 8-46 | 8-9 |
| నం. 12 హైద్రాబాద బి జి-ఖాజీపేట ప్యాసింజరు, | 19-45 | 19-4 (బి) |
| నం. 1 సికింద్రాబాద-వాడీ ప్యాసింజరు. | 17-20 | 17-55 (బి) |

(చిన్న లైను)

### చేరుట

| | సికింద్రాబాదు, (ఎం.జి.) గం.ని. | హైద్రాబాదు గం.ని. |
|---|---|---|
| నం. 31 మన్మాడ్-హైద్రాబాద యం జి ప్యాసింజరు | 6-50 | 7-34 |
| నం. 35 ద్రోణాచలం-సికింద్రాబాద-ప్యాసింజరు | 18-50 | 18-18 |
| నం. 33 మన్మాడ్-హైద్రాబాద ఎం.జి. ప్యాసింజరు | 20-41 | 21-10 |
| నం. 27 ద్రోణాచలం సికింద్రాబాదు ప్యాసింజరు | 6-0 | 5-25 |

### వెళ్లుట

| | | |
|---|---|---|
| నం 34 హైద్రాబాద ఎం జి మన్మాడ్ ప్యాసింజరు | 7-33 | 6-50 |
| నం. 36 సికింద్రాబాద-ద్రోణాచలం ప్యాసింజరు | 7-0 | 7-24 |
| నం. 32 హైద్రాబాద-యం.జి మన్మాడ్ ప్యాసింజరు | 20-0 | 19-5 |
| నం. 8 సికింద్రాబాదు ద్రోణాచలం ప్యాసింజరు | 22-0 | 22-20 |

నోటు:—

(ఎ) హైద్రాబాద బి.జి. నుండి వచ్చు సికింద్రాబాద వెళ్లును తిరిగి సికింద్రాబాద నుండి 17-20 గంటలకు వాడికి బయలుదేరును

(బి) ఈబండ్లు ఖాజీపేటలో ఢిల్లి,మద్రాసు మధ్యవచ్చు వెళ్లు గ్రాండుట్రంక్ యెక్స్ప్రెస్ బండ్లలో, వార్ధా బెజవాడమధ్యగల మెక్సెడ్ బండ్లలో కలుపును.




# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర ఫాల్గుణ బ॥ ౫

సోమవారము


## ఫ్యాక్టరీల, బాయిలర్ల పరీక్ష

## ౧౯౩౬-౩౭ ఫ.

గొప్పగొప్ప యంత్రాగారములను (ఫ్యాక్టరీలను), బాయిలర్లను పెట్టి పరిశ్రమలను సాగించు పద్ధతివల్ల రాజ్యములో వస్తూత్పత్తి అపరిమితముగ హెచ్చవచ్చును గాని, వాటిని యజమానులు కేవలము స్వలాభమునే చూచుకొనుచు నిర్వహించుచుండు నంతకాలము వాటివలన దేహారోగ్యమునకును, కూలిపనివారల స్థితిగతులకును ఎంతయో నష్టము, బాధ సంభవించవచ్చును. కాని సాధారణముగా యజమానులందరును వెలుపలినుండి ఎట్టి నిర్బంధము లేక తమఫ్యాక్టరీలను దేశారోగ్యమునకును, పనివారల యొక్కయు, చుట్టుప్రక్కలవారి యొక్కయు క్షేమమునకును భంగము రాకుండ నిర్వహించుకొందురనునది ఊహా రాజ్యములో నిజము గావచ్చునేమో! పారిశ్రామిక విప్లవమందు ముందంజవేసిన పాశ్చాత్య దేశము లన్నిటిలోను, తుదకు పరిశ్రమల యజమానుల పలుకుబడి ఎక్కువగా గల దేశములలోకూడ ఫ్యాక్టరీల యొక్కయు, బాయిలర్లయొక్కయు, పరిశ్రమలయొక్కయు, నిర్వహణ విషయములో శాసనములచే కొన్ని కట్టుబాటుల నేర్పరచుట, ఈ అనుభవమునే సూచించుచున్నది. మన ప్రభుత్వము వారును అట్టి కట్టుదిట్టములు చేయుటకై "ఫ్యాక్టరీల, బాయిలర్ల శాసనము" నొకదానినిచేసి, దాని నమలు పరచుటకై కొందరు అధికారులుగల ఒకశాఖ నేర్పరచి యున్నారు. ఆశాఖయొక్క ౧౯౩౬-౩౭ ఫ. నివేదిక మాకు పంపబడినది.

ఫ్యాక్టరీలశాఖ పనిచేయుటకు ప్రారంభించి ఈ నివేదిక సంవత్సరముతో అరేండ్లైనవి. నివేదిక కాలమందు ఒక్క ఫ్యాక్టరీల శాఖలోనేగాక, బాయిలర్లశాఖలోగూడ పని పైఅధికారులకును, క్రింది గుమాస్తాలకును గూడ హెచ్చినట్లు చెప్పబడినది. అందుచే పై పరీక్షాధికారుల సంఖ్యను, గుమాస్తాలసంఖ్యనుగూడ హెచ్చించవలెనని ఇదివరకే చేయబడినసూచన తిరిగి జ్ఞాపకము చేయబడినది. హెచ్చించవలసిన అవసరము ఇదివరకే విశదీకరించబడియుండెను. ఇపుడు, ఈశాఖయొక్క ఆదాయము నూటికి నూరువంతున హెచ్చుటవల్ల ఈశాఖలో ఉద్యోగుల సంఖ్యను హెచ్చించుట నష్టముకాదని చూపబడినది. ప్రభుత్వము ఈ హెచ్చింపు విషయమై ఆలోచించుచున్నట్లు తెలుపబడినది.

నివేదన సంవత్సరమందు ఫ్యాక్టరీల శాఖయొక్క రిజిస్టరునందు క్రొత్తగా కట్టబడిన ౧౭ ఫ్యాక్టరీలును ఇదివరకే ఉండిన ౪౪ ఫ్యాక్టరీలును చేర్చుకొనబడెను. మొత్తము రిజిస్టరులో ఫ్యాక్టరీలసంఖ్య ౫౭౧. అనగా ప్రతిశతి దాదాపు ౧౧.౯ వంతున హెచ్చినది సంవత్సరములో మొత్తము 322 ఫ్యాక్టరీలుమాత్రమే పనిచేసి యుండెను. వాటిలోను ౪౩ మాత్రమే సంవత్సరము పొడవునను పని గలవి. మొత్తము ఈ ఫ్యాక్టరీ లన్నిటిలోను కలిసి రోజుకు ౨౯23౨ మంది కూలిపనివాండ్రు పని చేయుచుండిరి. అనగా ౧౯౩౫ ఫ.లో నగటు హాజరీ లెక్కమీద ప్రతిశతి ౧.౪ వంతున హెచ్చుదల కనపడినది. రిజిస్టరు చేయబడిన ఫ్యాక్టరీలలో మొత్తము 3౨౯ పరీక్షించ బడినవి. రిజిస్టరు చేయబడిన వాటిలో ప్రతిశతి సుమారు ౧౭. ౭ వంతున ఒకసారియైనను పరీక్ష చేయబడనివి. రిజిస్టరు చేయబడని ౪౦ ఫ్యాక్టరీలు ప్రత్యేకముగ పరీక్షించబడినవి. ప్రతి ఫ్యాక్టరీయు అధమము సంవత్సరమున కొకసారియైనను పరీక్షించబడునట్లు చేయవలసియున్నది.

వివిధ పరిశ్రమలలో ప్రతిరోజు నగటున పనిచేయు శిశువులసంఖ్య౧౯౩౪ ఫ.లో ౯౬౭ నుండి నివేదన సంవత్సరము ౯౪౧ కి తగ్గినది. సుమారు ప్రతిశతి ౨. ౭ వంతున తగ్గినదన్నమాట. ప్రతిరోజును మొత్తము ౬౬౨౪ మంది స్త్రీలు పనిచేయుచుండిరి. కాని స్త్రీలచే రాత్రివేళ పనిచేయించినట్లు కనపడలేదు.

మొత్తముమీద ఫ్యాక్టరీలలో పారిశుధ్యము ౧౯౩౪ ఫ. లోకంటె సంతృప్తికరముగ నుండినట్లు చెప్పబడినది. సంవత్సర మంతయు పనిచేయని ఫ్యాక్టరీలలో వారమునకొకసారి శుభ్రము చేయవలసిన అవసరము సూచించబడినది. జననివాసముల మధ్యనున్న కొన్ని ఫ్యాక్టరీలలో చెత్తను తీసివేయించవలసి వచ్చెను. పనివారల ఆరోగ్యము మొత్తముపై సంతృప్తికరముగ నుండెను వారల కీయబడుచుండిన వేతనములలోకూడ మార్పులేకుండెను. సమ్మెలులేక శాంతముగా నుండెను. యంత్రములను జాగ్రత్తగా వాడనందువలన కలుగు ఉపద్రవములు అరుదైనట్లు చెప్పబడినది.

ఇరువురు పనివారలు పైనుండి పడి చచ్చిరి. ౨౧ మందికి గొప్పగాయములయ్యెను. ౪౩ మందికి చిన్నగాయములయ్యెను. ఈ ఉపద్రవముల సందర్భములో ఉపద్రవములకు గురియైన వారలకుగాను నష్టపరిహారము తగినంత లభించలేదు. ఫ్యాక్టరీల శాసనముప్రకారము ఏర్పాట్లు చేయనివారలపై అభియోగములు రెండు న్యాయస్థానములలో పెట్టబడెను. ఒకనేరస్థుడు విడుదలయాయెను. శాసనమునకు వ్యతిరేకముగ నడచిన వారలపై అభియోగములను సంఘటించుటలో చిక్కు కొంత యున్నట్లు నివేదికలో మొఱ పెట్టబడినది.

నివేదన సంవత్సరములో క్రొత్తవి ౪ పాతవి ౮ బాయిలర్లు రిజిస్టరు చేయబడినవి. సంవత్సరాంతమున ౫౦౫ బాయిలర్లు రిజిస్టరు లెక్కలో నుండెను. వాటిలో 3౫౯ పరీక్షించ బడెను. తక్కిన బాయిలర్లు పనిచేయనందువలన వాటిని పరీక్ష చేయించలేదు. ముందుగా తెలిపినను 3౫ మంది యజమానులనుండి బాయిలర్ల పరీక్షకై దరఖాస్తులు ఆలస్యముగా రాగా వాటికి ఎక్కువ ఛార్జి వసూలు చేయబడెను

మొత్తముమీద నివేదన సంవత్సరమందు ఫ్యాక్టరీల, బాయిలర్ల పరీక్షా శాఖయొక్క పనిచే పరిస్థితులు పూర్వము కంటె ఎక్కువ కొంచెము బాగుపడినవని చెప్పనచ్చును.

## దేవుని దురదృష్టము

(ఒక విలేఖరి)

అమ్మనబోలు, మార్చి ౧౩

ఇచ్చటికి సమీపమందలి పల్లెపాడు గ్రామమందొక వైష్ణవునియింట నృసింహవిగ్రహము గలదు. గ్రామమందెవరింట యేశుభకార్యము జరిగినను వారీదేవతను సేవదీయించుట కర్తవ్యముగా ఏర్పడినది. యిటీవల యొకపద్మశాలి యింట సత్యనారాయణవ్రతముజరుగ ఆచారప్రకారము దేవతాయూరేగింపు జరుపబడెను. ఈ రేగింపుకు పోలీసుపటేలనుమతిచ్చిరి. కాని మధ్యగ్రామమునందు పిచ్చయ్య, బందగియను సేతుసింధీలు దేవతాయూరేగింపును ఆపివేసిరి. ప్రజలు మేళతాళములేక దేవతను యథాస్థానమునకు చేర్చదమనినను వినక దివిటీలనార్పి దేవతాపీఠమును బలవంతముగా నచ్చట దించివేసిరి ఇదిజరుగువరకు రాత్రి ౧౧ గంటలైనది. ఉదయము ౯ గంటలవరకచ్చటనే దేవతావిగ్రహము ధూప, దీప నైవేద్యములులేకపడియుండుటయేగాక మతేతరులు తాకుటచే తిరిగి సంప్రోక్షణ జరుగవలయునని ప్రజలు పట్టుపట్టిరి.

పటేలుగారి ఒలవంతముపై విగ్రహము గైకొనబడినను ప్రజలయందుమాత్రముఅలజడి క్రమముగా పెరుగుచున్నది

## వార్ధాలో "లిధుయానా ఆక్రమణము"

వార్ధా, మార్చి ౧౭

పోలిషు ప్రభుత్వమువారివలన లిధుయానా ప్రభుత్వమున కల్లోలము సంభవింపబడితీరునని రూఢిగా అనుకోబడుచున్నది. "పోవావాడు వెడలుడు" లిధుయానా ఆక్రమించుడు"ను నాదములతో అశ్వికులు ప్రజలు నగరవీధులలో తిరుగుచున్నారు.

సైన్యమును లిధుయానాయందు ప్రవేశించి న్యాయపరిపాలన మొనరించు ప్రదర్శనములు పోలెండు దేశమందలి యితర నగరములలో సహితము విరివిగా జరుపబడుచున్నవి.

## క్రీ.శ. ౧౯౫౭లో ప్రపంచ అంతము

### ౧౯౫౩లో యేర్పడు తుఫాను ప్రపంచమును జలప్రళయ మొనరించును

### సూర్యునియందు వేడిమి, భూమియందలి వేడిమితగ్గి నీరు ఘనీభవించును

### నల్ల నక్షత్రము నాశన చిహ్నము

జ్యోతిష్కుల జోశ్యము

నక్షత్రమండలమునం దేర్పడనున్న నల్లని నక్షత్రము జ్యోతిష్కులలో గొప్ప అలజడి యొనర్చుచున్నది. ఇటీవలనే కొందరు జ్యోతిష్యవిధులొక నక్షత్రశాలనుండి దినతికాలములో యేర్పడనున్న నల్లని నక్షత్రము ప్రపంచమున కపాయము వాటిల్లదీయునని ప్రకటించిరి. దీని దిగ్దర్శనముతో ప్రపంచనాశన మారంభమగును అనగా యిందుకై సుమారు నాలుగు సంవత్సరములనుండి, అనగా క్రీ.శ. ౧౯౪౧ ప్రారంభమగును. క్రమంగా యీదుస్థితి వృద్ధిగాంచి చివరకు క్రీ.శ. ౧౯౫౭లో ప్రపంచ మాసాంతము సంభవమగును, దానివివరము లిటుల ప్రకటింపబడినవి —

క్రీ.శ. ౧౯౪౧ సం॥ నవంబరు మాసమున ఆకాశమునందొక నల్లని నక్షత్రమేర్పడును. అప్పుడది దూరదర్శిని సాయమున గోచరించుచుండును. క్రీ.శ. ౧౯౪౩ సం॥ను మొదటివారంలో సర్వసామాన్యముగా కంటికి దృగ్గోచరమగావచ్చును. చీకటిరాత్రులలో మబ్బులులేక నిర్మలముగా నుండుసమయమున ఆల్డిబెరన్-చిత్రా నక్షత్రము—కు ప్రక్కన మినుకుమినుకుమను నక్షత్రము, దూరదృష్టి గలవారికి, అనాయాసముగ కనుపడ నొందలిడును.

క్రీ.శ ౧౯౪౪ వసంతఋతువు నందినక్షత్రము చక్కగా దృగ్గోచరమగును. క్రమంగా దీనియందు కాంతి హెచ్చును. క్రీ. శ. ౧౯౫౦ సం॥ జనవరి మాసమున ఆకాశమునందు యీ నక్షత్రము కాంతివంతముగా కనపడగలదు.

౧౯౫౩ సం॥లో యీ నక్షత్రమునకు తూర్పుచలనము కలుగును. వృషభరాశినుండిది కన్యారాశిని ప్రవేశించును గురుమండలమునకు సమీపించును. క్రమంగా దీనియందు కాంతి హెచ్చుటచే బృహస్పతిగ్రహము కన్న యిది యెన్నియో రెట్లధికముగా కనపడుచుండును.

౧౯౫౩ జనవరిలో దీనక్షత్ర పరిమితి హెచ్చును. జూలై ౧౯౫౩ నాటికి పున్నమనాటి చంద్రుని ఆకృతి బడయును. ౧౯౫౭ సం॥ ఆగస్టువరకింక హెచ్చును.

దీని పరిమితి హెచ్చినకొలది ప్రపంచమునందు దుర్భిక్ష మారంభమగును. దీనివలన కలుగు దుష్ఫలితములపూర్వములై యుండును.

౧౯౫౩ జూలైనుండి సముద్ర తరంగములలో తుఫాను యేర్పడ మొదలగును. దీనివలన సముద్రపు టొడ్డునగల న్యూయార్కు, సాన్ఫ్రాన్సిస్కో మొదలగు ప్రదేశాలలో వరద లేర్పడును. క్రమంగా యీతరంగములు 300 అడుగుల యెత్తుకు లేచును. దీనితో భూమి అవరింపబడును ఒడ్డునయందు దేశములన్నియు కొట్టుకొనిపోవును ప్రజలు, జంతువులు నశించును.

అతర్వాత నక్షత్రమునకు పశ్చిమముగ మనోహరుడను, దీని అరువాలు రోజురోజు హెచ్చి ౧౯౫౩ సం॥ ౧౧ ఆగస్టువరకు చంద్రబింబముకన్న ౧౦ రెట్లధికమగును. భూమండలమునకు సమీపించును. దానిలో ప్రతిరోజు సముద్ర తరంగములు రెండుమారులు లేచును. ఎవో రెండుపర్వత శిఖరములుతప్ప భూభాగమంతయు జలప్రళయమై తీరును. నీటినడికి తాళలేక వృక్షములు, భవనములు, కట్టడములు గడ్డిపోచలవలె నీటిలో నీదులాడును.

౧౯౫౩ సం॥ ఆగష్టు ౧౧ తేదిన కన్యక ప్రదేశములకు వెళ్లియుండు వారదృష్టవంతులనవచ్చును. వారు క్రిందమాదిన అంతా నీటిమయముగా కనుపడును, క్రిందనీరు, పైన నక్షత్రము.

ఈనక్షత్రోదయముతో సూర్యుని వేడిమి తగ్గును. ౧౯౫౩ సంవరకు భూమండలమునకు సూర్యమండలము దూరమై పోయినటులుండును. అనగా ౧౯౫౪ సం॥ జనవరి మాసారంభమువరకు ఆకృతియందు సూర్యమండలము సగమైపోవును.

క్రమంగా తుఫాను తగ్గుటచేతను, సూర్యమండలము దూరమగుటచేతను నీరు గడ్డకట్టును భూమియందలి వేడిమి అంతమగును. అనగా నీరు ప్రతిచోట గడ్డగా యేర్పడితీరును.

ఈగండమునుండి తప్పించుకొనువారలు చలికి తాళలేక వాయు కోలగర్భమున తలదాచుకొనుటకు ప్రయత్నింతురు- చివరకు ప్రపంచ మంతమైతీరును.

## కల్లు త్రాగుటకు దండోరా వేయించుట

(గోలకొండ విలేఖరి)

హుజూరాబాదు, మార్చి ౧౫.

ఇది జనగాము తాలూకాలోని గ్రామము. సుమారు మాసముకోలలనుండి యీ గ్రామమందేగాక చుట్టుపట్టు పది గ్రామాలలో మద్యపానము పూర్తిగా సాగిపోయెను ప్రజలెవరు కల్లుసారాయి మొదలగు మత్తుపదార్థము లుపయోగించమని ప్రమాణమొనరించిరి దీనివలన యీ గ్రామవాసుల మనోనిశ్చయము యితర గ్రామ ప్రజలకు ఆదర్శప్రాయముగా నుండెను.

ఈమధ్యన "మద్యపానవిరోధక కేంద్రసంఘము"వారు రాష్ట్రమునందు మద్యపాన నిషేధ దినమును జరుపుటచే ప్రజల మనోనిశ్చయమునకు అచరణభాగ్య మబ్బెను. యువకులలో ప్రబోధము కలుగుటచే ప్రజలకు మద్యపానమునందు కలుగుచున్న అరిష్టము, దుష్ఫలితములు వివరించుటచే గ్రామగ్రామమందు యీయాందోళనము విజయవంతముగా సాగుచున్నది.

అదేవిధంగాని ప్రజలుతాగుటకు కొందరు నచ్చుపంచాయితీ, వారు తమ ఆభ్యంతరము తాము ప్రయత్నించుకొంటూ పూర్వ గ్రామాధికారులు, అధికారు లడ్డుపడుచున్నారు. దయామయులగు ప్రభుత్వమువారు రాష్ట్రమునందు యీదుర్వ్యసన మంతమొందించుటకు తగిన నియమములు కలిగించుటయేగాక తగురీతిగా ప్రజలకుసాయమొనరించుచుండ తేనాబండలి అబ్కారి యిన్స్పెక్టరుగారు యీగ్రామమున కరుదెంచి ప్రజల మనోనిశ్చయము గాంచి ఆశ్చర్యమొంది తిరిగి యీ దురభ్యాసము ప్రవేశపెట్టుటకుగాను గ్రామ ప్రజలందరు తప్పక కల్లుత్రాగవలయునని దండోరా వేయించి బలవంతముగా పోయిన అభ్యాసమును పునరుద్ధరించుచున్నారు ప్రభుత్వమువారీ విషయమై దృష్టిపరచి ప్రజల కాపాడెదరా!

## జిల్లా బోర్డుల యేర్పాటులు

(గోలకొండ విలేఖరి)

బెంగుళూరు, మార్చి (ఉపాప్రె)

మైసూరు జిల్లాబోర్డుయందు 3౫ సభ్యులు మాండియాబోర్డుయందు ౨౯ సభ్యులుండునటుల నిర్ణయింపబడినది ప్రతిబోర్డుయందు సభ్యులు, ఉపాధ్యక్షుడు యెన్నుకోబడును మైసూరుజిల్లా డిప్యూటీ కమీషనరు యీ రెండు బోర్డులకు ౧౯౪౯ సెప్టెంబరు ౧౯౪౧వరకునుండి అధ్యక్షులు యెన్నికలు జరుగువరకు అధ్యక్షపదవి నలంకరించునని ప్రభుత్వమువారు విశదపరచిరి

హిందూ మహమ్మదీయ కలహములు

కృష్ణరాజనగరమునకు సమీపమందలి యొక గ్రామములో హిందూమహమ్మదీయుల కలహము జరిగినది, ౨౫గురు గాయపడిరి

హోళీసందర్భములో హిందువులు కలిసి మహ్మదుల వేషములు యూరేగింపుతో దీయుటకు సంకల్పించగ మహమ్మదీయు లాక్షేపించిరి. హిందువులు తమకు జరుపుటకు సంపూర్ణ స్వాతంత్ర్యము గలదని ప్రయత్నించుచుండ యీయుభయులకు సంఘర్షణ మేర్పడినది రాళ్లు యిటుకలు రువ్వుకొనిరి

విషయము తెలియగనే పోలీసు సూపరింటెండెంటుగారు పోలీసుదళముతోనేగి శాంతి నెలకొలిపిరి ఉభయవర్గములవారిపై పోలీసువారు చర్యదీసుకొన నిశ్చయించిరి

మైసూరునుండి ౨౫మైళ్ళ దూరమున గల యొడ్డోరాయందిట్టి కలహము జరుగుటవలన యుభయవర్గములవారు గాయపడిరి,

హోళీ యూరేగింపాకటి యిచ్చట మసీదు ముందరినుండి ఇష్టముండ మసీదునుండి రాళ్లు రువ్వబడినవి

జిల్లా సూపరింటెండెంటు, మేజిస్ట్రేటు గారలుతక్షణమే మైసూరునుండి పోలీసు దళముతో అప్రదేశమునకేగి శాంతి నెలకొలిపిరి

# హైద్రాబాదధిక సంఖ్యాకుల ప్రార్థనాస్థితి

## ప్రజలకు ప్రాథమికసత్వము లపరిచితములు

## అధికసంఖ్యాకుల కన్యభాషయందు విద్యాభ్యాస నిర్బంధము

## మాతృభాషల అభివృద్ధికి తావులేదు

ఉస్మానియా విద్యాపీఠ మల్పసంఖ్యాకులకు లాభదాయకము

మహమ్మదు అహ్సన్ బి. ఏ. ఎల్ఎల్. బి., మహమ్మదు హసనొద్దీన్ బి. ఏ. ఎల్ఎల్. బి. హైకోర్టువకీలు రచించిన "హైద్రాబాద రాజ్యాంగసమస్యల"ను గ్రంథమును విమర్శించుచు మదరాసునగరమునుండి వెలువడు "వెల్తు అండ్ వెల్ఫేర్" పత్రికయందు సంపాదకీయముగా హైదరాబాద వాస్తవిక పరిస్థితులు విశదీకరింపబడినవి. దానియందు హైదరాబాద సంస్థానమునందు అధికసంఖ్యాకులు ముస్లిమేతరులైనను వారికి విద్యావిషయాది సౌకర్యములు లేనందున అల్పసంఖ్యాకులకు సమముగా పరిపాలనమునందవకాశము లేర్పడుట లేదనియు, ప్రజలకు ప్రాథమిక సత్వములింకను యీ ౨౦వ శతాబ్దమునందపరిచితముగా గలవనియు, హైదరాబాద ప్రజలస్థితి బ్రిటిషుప్రాంతమువారికన్న యొక శతాబ్దము వెనుకంజ వేసియున్నదనియు, ప్రజలపై యుద్ధానిర్బంధ మమితముగా గలదనియు సంస్థానాధీశుడు స్వయముగా దిలకించిన ప్రజాభివృద్ధిగాంచ వీలగుననియు దేశీయుల అభ్యుదయమునకు రెసిడెంటుగారడ్డుపడుటసత్యమనియు, ప్రభుత్వమువారి వివిధశాఖలలో జరుగుచున్న అన్యాయములు విచారింపబడవలయుననియు, ఉద్యోగములు పక్షపాత రహితముగా అర్హతలపై ప్రసాదింపబడవలయుననియు, సంస్థానమునందు వెంటనే నియోజకత్వముల ప్రవేశపెట్టి బాధ్యతాయుతప్రభుత్వము స్థాపించవలయునను విషయములు వివరింపబడినవి.

హైదరాబాదు యొక్క రాష్ట్రము: పాముకోర్థ — బెరారు చేర్చబడినటుల ప్రఖ్యాతి. నిజాంగారి ప్రథమపుత్రులు బెరారు యువరాజనామముతో వ్యవహరింపబడుచుండు. బరారు మధ్యరాష్ట్రభాగమైనటుల, బ్రిటిషుప్రాంతమగుటంజేసి కాంగ్రెసుప్రభుత్వ సౌకర్యముండుట మా పాఠకులకు విదితము

ప్రస్తుతము హైదరాబాద నిజాంగారి పాలనమునందు గలదు. పిరికిసాయముగా నుండుటపరిపాలక— నాబెహాదూరుగు— సంఘముగలదు. దీనియందు రెవిన్యూ, పోలీసుమంత్రి యూరపియుడు పోలీసు వైద్యశాఖలు యూరపీయాధికారుల ఆధీనమునందుగలవు, స్టేటురైల్వే సంపూర్ణముగాయూరపీయువ్యవస్థ అండర్ యందు కార్యాలయముగల హోంబోర్డునున్నది, హైదరాబాదయందలి సర్ అక్బర్ హైదరీగారు బోర్డుఆఫ్ డైరెక్టర్సు అధ్యక్షులు.

పరిపాలకునివలన నిర్ణయింపబడిన వర్గము వారేర్పరచిన నియమములు రాజ్యాంగ లాభకారియగుటంజేసి హైదరాబాదప్రజలకు ప్రజాసత్వపు ప్రాథమికస్వత్వములైనలేవు. దేశపరిపాలనమునందు ప్రజలకు తావులేదు. వారికను ప్రార్థనాస్థితియందే గలదు. పురపాలకసంఘము మొదలగుసంస్థలకొకరిదరిని యొన్నికపద్ధతి అమలునందున్నటుల కొందంభి, హాయపడినవి ప్రజలకింకను యెన్నికలసభలు, ప్రచారసభలు జరుప వీలులేదు. హైద్రాబాద ప్రజలస్థితి యొక శతాబ్దమునకుపూర్వము బ్రిటిషుప్రాంతమందలి ప్రజలమాదిరిగా గలదు ప్రజాభిప్రాయము బహిరంగపరచ వీలులేనందున సంస్థానమునకొవలయుందువరకి పరిస్థితిగతులు తెలియజాలవు. పత్రికలు పరిపూర్ణముగా బంధింపబడినవి. కఠినియమములవలన ప్రజాభిప్రాయము వినబడజాలదు గ్రంథకర్తలు విశదపరచిన వ్యక్తిగతాభిప్రాయములు సంస్థానమునందు ప్రతికరితునూరు కొంగల మహమ్మదీయేతర జనసంఖ్యలో యీరచయితలు, గోచరించుచున్నను అల్పసంఖ్యాకవర్గమునకు చెందినవారు ప్రభువుగారిప్రాపున సామాన్యముగా యీ అల్పసంఖ్యాకవర్గమే దేశమునందు పాలకవర్గముగాగలదు ఇతరవర్గములవారికి విద్యాసంపాదనమేకన్నో లేక అన్యభాషయందు బలవంతముగా విద్యగరపబడు నవకాశ ముండుటచేతనో యీఅల్పసంఖ్యాకవర్గమునకు సమముగా వీరు ఈ దేశమునందు పరిపాలనములో తగుస్థానము బడయజాలకున్నారు ఈయిద్దరు మహాశయులీ పాత్రమునందిదినుల్లేఖించుటకువచ్చిరి. లేకున్న అతి యోగ్యతగా నుండెడిది తోలిపలుకు వ్రాసినవారు హిందువులు, అధికసంఖ్యాకవర్గమునకు చెందినవారు. ఈరచయితల వర్గమువలన సంస్థానమునందధికసంఖ్యాకులకు జరుగుచున్న అన్యాయము, అసౌకర్యములువిదితపరచుటకు వీరుమరువలేదు. అహసన్ గారు, ప్రజాసేవకునిగా, గవర్నమెంటుఆఫ్ ఇండియాయక్టుచే—భారత ప్రభుత్వ— వినయింపబడిన "ఫెడరేషన్"

యందు హైద్రాబాద చేరుటకు ప్రజలెందుకు ప్రతికూలించుచున్నారో విశదపరచుట కభిలషించుచు ప్రజాభిప్రాయమును విదితపరచుటకు సంకల్పించిరి. కాని హైద్రాబాదప్రజలు ఫెడరేషనును ప్రతికూలించుచున్నారాయని ప్రశ్నించుచున్నాము మాకు తెలిసియున్నంతవరకు హైదరాబాద ప్రజలు ఫెడరేషన్ భావమును కనుకూలించుచుండుటచే ఫెడరల్ పద్ధతివలననే పరిపాలనములో తమకు ముక్తి కలుగునని అధికసంఖ్యాకు లాశించుచున్నారు, నేటి హైద్రాబాదప్రజల వాస్తవికస్థితి విశదపరచనిది మాకర్తవ్యము నెరవేర్చజాలము. పాలకుడు ముస్లిం తెలుగు, తమిళము, కన్నడము, మహారాష్ట్రము, మొదలగుభాషలు మాటలాడువారుప్రజలు. ఆంధ్రు అధికసంఖ్యాకులు, ఆంధ్రప్రాంతము రాష్ట్రములో అధికభాగము. ముస్లింలకు వారిప్రత్యేకప్రదేశమేదియులేదు. రాష్ట్రమునందంతటను స్లింవర్గమువ్యాపితమైయున్నది అయినను కోర్టుభాష ఉర్దు. రాష్ట్రమునందు మాతృభాషలకు, బ్రిటిషుప్రాంతములందు ఇంగ్లీషు ఇతరభాషలకన్న మిన్నగా పరిగణింపబడినటుల, అదేస్థానముగలదు. కాని బ్రిటిషు పరిపాలనమునందు స్థానికభాషలు కోర్టుభాషలుగా లెక్కింపబడినవి. కాని హైద్రాబాదయందు ఉర్దు నిర్బంధము, ఆంధ్రప్రాంతమునందు, యితర ప్రాంతమందు, డిస్ట్రిక్టు కోఆపరేటివుబ్యాంకు—జిల్లా సహకారబ్యాంకులు—ల లెఖ్ఖ ఉర్దూయందుంచబడుచున్నవి ఇంకనుమించుగా పాఠ్యగ్రంథములన్నియు నుర్దూయందనుకరింపబడినవి. విశ్వవిద్యాపీఠము నుర్దూయందునుగలదు, జాతిమత భేదము పాటింపక ప్రతివారందరు నుర్దూయందే పఠింపవలయును దేశీయులు యీ అధ్యయనము దీనియందితరములకన్న చక్కగా గ్రహింపగలరని యొక సందర్భమున విద్యాపీఠపు ప్రోచాన్సలర్ గారు సెలవిచ్చిరి అది అటులనాయని ప్రశ్నించుచున్నారు? హైద్రాబాద ప్రజలస్థితి బ్రిటిషురాష్ట్రముల ప్రజలకన్న బాగులేదు, కాని ముస్లిమేతరులస్థితి అతిహీనము గాగలదు. ముంజేతికంకణమున కద్దమేల!

ఈయిద్దరు న్యాయవాదులు తమపొత్తముల ద్వారా యీవిషయములను జనసామాన్యమునకు విశదపరచుటకు మరచిరి

ఈస్టుఇండియా కంపెనీకాలములో హైద్రాబాద స్వతంత్రసంస్థానముగా నుండినటుల తెలుపబడినది. ఈభావమున కనుకూలముగా నుండుటకై భారతచరిత్రయందలి ప్రాచీన మొగలు యుగమునందు కొంత శోధింపబడినది. సంస్థానాధిపతియొక్క కొద్దిఅధికారములు పరిపాలనములో బాధముకడించుటచే సంస్థానాధిపతికి బ్రిటిషువారికి జరిగిన యొడంబడిక హక్కులలో సంస్థానప్రజలకంతగా సంబంధములేదు ప్రజలలో అధికసంఖ్యాకులకు వారి మాతృభాషయందు విద్య గరపు సౌకర్యముమ బ్రిటిషువారి యొడంబడిక స్వత్వములు పాలకుని యాటంకపరచుటలేదు. సంస్థానమునందు వర్గీయ విద్యా

సంస్థలకు—అలా ఆంగీకరించ వీలులేదు—తావులేదు ముస్లింలకు నిజముగా ఉస్మానియా విద్యాపీఠ మత్యుత్తమమైనది ఆంధ్రులకు కన్నాటకులకు, మహారాష్ట్రులకట్టి విద్యాపీఠము లేర్పడువరకు యీభాషలుగల ప్రజలు గణింపబడిరనవచ్చును పాలకుడు తనసంస్థానప్రజ లవిషయమై తన కర్తవ్యము నెరవేర్చనందున సర్వాధిపత్య యొడంబడిక స్వత్వముల పునర్విమర్శించు అవసరము లేదనవచ్చును, వారిటుల చేయుట కభిలషించుటలేదనిగాదు,, వారిమంత్రులు వారికటుల సలహాలొసగుటలేదు. నిజముకాబోలు? సంస్థానమునకు ఫెడరేషన్ అంటగట్టుటతప్ప భారతదేశమునకు కలుగుచున్న శాసనపు మార్పులు సంస్థానమునకు ప్రభావితము లగుటలేవు, వచ్చుచున్న ఆ ఫెడరేషన్ తప్పించదలప స్వలాభాపేక్షితులగుకొందరు "పాలకుని సర్వాధిపత్యస్వత్వము"ను వాదముతో ఘోషించుచున్నారు, ప్రస్తుతస్థితియందు హైద్రాబాద రాజకీయములను ఉద్దింగు ప్రభువుగారి "గస్తీ తలేఖ"— obnoxious letter—దాని వ్యాఖ్యానములు సంబంధములుగా గలవు పరిపాలనము తవకువీలు, సాధనముగల వాక్కులన్నియు న్యాయపూరితముగా ప్రజలకు ప్రసాదించినవమ్మట యొడంబడిక స్వత్వముల పునర్విమర్శ నావసర మేర్పడుచుండును ప్రస్తుత పరిపాలనము విద్యయందు, ఎన్నికపద్ధతియందు ప్రభుత్వోద్యోగములందు సంస్థానమందలి అధికసంఖ్యాకుల విషయములో తనకర్తవ్యము నెరవేర్చలేదని యీ యుద్ధయులు బాధ్యతగల పౌరులమాదిరి జనసామాన్యమునకు విదితపరచగలరని యాశింపబడెను. దీనికి వ్యతిరేకముగా అధికసంఖ్యాకుల కపకారమొసగినవారి దృష్టి మతవర్గితమైయుండునని వీరు భీతావహులగుచున్నారు

ప్రస్తుత పరిస్థితులలో హి. ఘ. వ. నిజాంగారు యించుమించుగా శాసననిర్మితప్రభువులుగాగలరు ప్రభుత్వపద్ధతి త్వరలో మారవలయును. హైద్రాబాదయందు సత్వర బాధ్యతాయుత ప్రభుత్వ సంస్థాపనకు అధికసంఖ్యాకుల మతవర్గత్వము—కమ్యూనలిజం—గొప్ప అడ్డముగా గలదు. జాతీయత్వవేషమున మతవర్గముగా ప్రయత్నించుటను హిందువులకు తగు కారణములుండవచ్చును. కాని యిటుల ప్రవర్తించుటవలన వారు స్వయముగా బాధ్యతాయుత ప్రభుత్వమునకు ప్రతికూలురుగా నుండుట గాంచకున్నా యీరచయితలు వాపోవుచున్నారు. అల్పసంఖ్యాకులు ప్రస్తుత మనుభవించుచున్న సౌకర్యములు అధికసంఖ్యాకు లధికారము వహించిన గోల్పోవుదురని శంకించుచున్నారు. కాని ప్రభువుగారు ప్రజలకుప్రాథమికస్వత్వములు సమముగా ప్రసాదించిన అల్పసంఖ్యాకులవలెనే అధికసంఖ్యాకు లనుభవించితీరుదురు, అధికసంఖ్యాకులు మతవర్గముగా ప్రవర్తించునను విషయము నిరర్థకము.

ముస్లింలు బ్రిటిషు ప్రతికూలురులు గారట. అధిక సంఖ్యాకులు హిందువులుగల మైసూరు సంస్థానమునందు ప్రాథమిక, మాధ్యమిక ఉన్నత విద్య యుర్దూద్వారా యభ్యసించు సౌకర్యమేర్పరచబడినది. అన్యభాషయం దభ్యసించుట కధికసంఖ్యాకులు లేక అల్పసంఖ్యాకుల నిర్బంధింపబడుటలేదు. హైద్రాబాదయం దధికసంఖ్యాకు లటులేల యాశింపవలదు? కమ్మిరునందేమి జరుగుచున్నదో తెలియదు. హిందూ ముస్లింలకు భాష సమమై యుండవచ్చును. బాలురలు మాతృభాషయందు విద్యయభ్యసించుట, తదానుకూల యవకాశములు కలిగించుటయే ప్రతిరాజ్య ఆదర్శమైయుండవలయును. హైద్రాబాద యింతవరకటుల పలికినెరుగదు. ప్రజలకు యెన్నికలహక్కులు, సమాలోచన స్వాతంత్రములు, పోలీసువారి యనుమతిలేదయిన, రద్దుకృపవలయును. సంస్థానాధీశుడు సంస్థానమునందు జరుగు విషయములను స్వయముగా దిలకించవలయును గాని అధికారులు తెలుపువానిపై నాధారపడి యుండవలదు.

"హైద్రాబాదయందు ఫెడరేషన్ విరోధించువారెవరును లేరనియు, బ్రిటిషు యిండియాయందు ప్రజా పరిపాలనము స్వాగతమొసగుచున్నార"ని పొత్తమునం దుల్లేఖింపబడినది, సికింద్రాబాదయందలి బ్రిటిషు రెసిడెంటుగారు సంస్థానపు ముఖ్యవిషయముల నైముఖ్యమునకు బాధ్యులని వచింపబడినది. ప్రజావిశ్వాసమునకు పాత్రులైనవారిని నిజాం ప్రభువులు మంత్రులుగా యెన్నుకొనుపద్ధతి యేర్పడియుండిన పరిస్థితులు సంతోషకరములుగా నుండెడివట. కాని ప్రస్తుతస్థితియందు అధిక సంఖ్యాకులను పృథక్కరించి అధికార రహితులుగా జేయు పరిపాలనమునకు రెసిడెంటుగారెటుల బాధ్యులో విదితమగుటలేదు. ఆంధ్రులు మొదలగువారికి సరియైన విద్యాసౌకర్యములు కలిగించి, యుద్యోగములందు నియమించుటకు రెసిడెంటుగా రడ్డుపడుచున్నారా!

హైద్రాబాద సంస్థానము, ప్రక్కనుండే బ్రిటిషురాష్ట్రముల మాదిరి హైద్రాబాదప్రజలకు, అధికారుల జోక్యములేని, యెన్నికల నిందలగువానియందు కలయు సౌకర్యము లేర్పరచనంతవరకు యిప్పటిమాదిరియే అధిక సంఖ్యాకులకు ప్రవాసదశయందుంచుటయే సావరనిటీ స్వత్వముల పునర్విమర్శనా ఫలితమనవచ్చును. అధిక సంఖ్యాకులవలన స్వాగత మొసగబడు ఫెడరేషన్ ఆగమనమునకు పిలేర్పడిన యెన్నికోబడిన ప్రజాప్రతినిధులు భారత దేశమునందు ఫెడరల్ శాసనసభయందు యేర్పడు నవకాశము కలిగితీరును. సర్వాధిపతియొక్క యెన్నతాస్వత్వముల మార్పు జరుగనంతవరకు సంస్థానాధిపతుల నిర్ణయసభ్యుల సమ్మతులు రాజకీయశాఖవారి అస్తియగుట నిశ్చయము.

"అధికారములవలన శాంతి యేర్పడున"ను సూత్రముతో మేమేకీభవించుచున్నాము, మత విదళితకేక పరిపాలనము మార్చి ప్రజలకు నియోజకాధికారము ప్రసాదించుట కీయుద్ధయులు తమ అనామత్యులకు విశదపరచు టత్యవసరము. వలయు సౌకర్యములు స్వత్వములు ప్రసాదింపబడనందుననే అధికసంఖ్యాకులు దేశమునందు మూగపశువులుగా పరిణమింపబడిరి మతవిదళిత లేకేల దైనను స్థానికముక్క వ్యక్తి యేదో హాకుపై రప్పింపబడు విదేశీయుని కన్న మేలుగా యేర్పడితీరును. ప్రజలకు అధికారము ప్రసాదించినచే అర్హతలు విదితమగును.

ఏలాగాకను హైద్రాబాదేతరుల యుక్తపు పరిపాలనముకన్న స్వపరిపాలన ఉత్తమోత్తమమగునుట నిర్వివాదాంశము.

మత, జాతి విదళిత గమనించక హైద్రాబాదప్రజలే నూత్నమునపరించి తమభావి నిర్ణయ మొనరించవలయును. ప్రస్తుత పరిపాలనము అనేకశాఖలందసంతృప్తికరముగా,యుక్తమాధికత్వపరము కలిగియున్నటుల గ్రహించవలయును, వివిధశాఖలందు అపరిమితముగా జరుగుచున్న వ్యయములు, మొదలైన పరిపాలనమునందు జరుగుచున్న అన్యాయముల విచారించుటకొక విచారణసంఘ మేర్పడవలయును ఇంతేగాక వివిధవర్గముల ప్రతినిధులుగల సర్వీసు కమీషనొకటి రాష్ట్రమునందు దుద్యోగముల నిర్ణయించుటకై యేర్పరచవలయును. ఉద్యోగార్థుల అర్హత నిర్ణయములు స్థానికాధికారులవలనగాక మతవిదళిత,పక్షపాతరహితులైన స్థానికేతర సభ్యులవలన జరుపబడవలయును అల్పసంఖ్యాకుల సంరక్షణము కావలసి యుండునేని యుద్యోగములు వలయువంత దశస్థితు అనుభవించ జాలకున్నారు ఆనర్హులు, ఆవసరములైనంతవర్తుల వెంటనే తొలగింపబడవలయును. ఉద్యోగము కొంగుజారాక ౦ను యీకని మిత్ర కాయమనది గమనింపబడకూడదు. కొంతకాలమువర కన్యదాధికారుల బంధుగుల సద్యోగము లివ్వకూడదు. నేడు హైద్రాబాద ప్రభువున్నాయ పాలకులుగాగల యీరెండు కుటుంబముల వారి మధ్యపలి దీనితో నియ్యాలమై తీరును సత్యమెంత కఠినమైనను యిది వాస్తవిక పద్ధతి. హైద్రాబాద సావరనిటీ స్వత్వముల సంరక్షించుటయేగాక అభివృద్ధి బడయవలయును, అంతమాత్రమునకే ప్రజల స్వత్వము అంతమొందించవలయునని గాదు బ్రిటిషుప్రదేశముల కింగ్ యెంపరర్ గారికి గల శాసనపరిపాలకునిస్థితి యిచ్చుట ప్రభువు బడసిన ఆపాయకరము గాజాలదు. టపా, సిక్కా సౌకర్యములు, స్వత్వములు ముందుకహిత ముందవీలుగలదు. న్యాయపూరిత ప్రాచ్యరాజ్య చిహ్నములన్నియు నుంచబడవలయును.

## జపానువారి వేహాంఖవే ఆక్రమణము

షాంఘాయి మార్చి౧౭వ.

శాంతయుతముగా జపాను సైన్యము వేహాయిపేను ఆక్రమించుకొనెను. బ్రిటిషువారు శేసవికాల ప్రదేశముగా నుపయోగించుకొనుచున్న లియాకంగ్టావ్ ద్వీపమును ముట్టడించలేదు. అందువలన బ్రిటిషు ప్రతినిధి కార్యాలయమువారింతవరకేమియు చర్య గైకొనవలసినటుల లేదు.

# రాష్ట్రీయుల మద్యపాన నిరసనము

## అభివృద్ధిపక్షమువారి ప్రచారము ఫలించుట

గ్రామోద్యోగుల మాయాజాలములు నిర్మూలించు టత్యవసరము

(గోలకొండ విలేఖరి)

హైదరాబాదు మార్చి ౧౫

మద్యపాన నిరోధక కేంద్ర సంఘమువారి మనోనిశ్చయము పురస్కరించుకొని అభివృద్ధి పక్షమువారు రాష్ట్రమునందంతట మద్యపాన నిషేధము విజయవంతమొనరించుటకు సంకల్పించి వివిధ జిల్లాలలోని తమపక్షమువారికి పత్రికలద్వారా పత్రికముల ఒంపిరి విషయము దేశాభ్యుదయము మగుటంజేసి క్రమముగా ప్రచార మొనర్చబడినది తత్ఫలితముగా అనేకస్థలములందు మద్యపానము పూర్తిగా మానివేయబడినది. కొన్ని కొన్ని స్థలములనుండి గౌడుల దౌర్జన్యములు, గ్రామాధికారుల మాయోపాయములు తెలియవచ్చుచున్నవి. ఈవిషయమై అభివృద్ధిపక్షమువారు గాని, మద్యపాన నిరోధక సంఘమువారు గాని శ్రద్ధవహించి తగుచర్య గైకొనిన దేశీయులలో ఖాపవానిర్బంధములేక యేర్పడిన మద్యపాన నిరసనము ఫలవంతమై తీరుననుట నిశ్చయము.

### మంథెన

తహసీలు ఆఫీసు ఎదుట మద్యపాన నిషేధ దినసమహోత్సవముగా జరుపబడినది. తహసీలుదారుగారు స్థలాంతరమేగుటచే, మున్సిపుగారు దయచేయనందున డా. రామమూర్తిగారు అధ్యక్షత వహించిరి బాలురు మద్యపాననిషేధ గీతముల పాడుచు నగరసంకీర్తన మొనరించిరి

అభివృద్ధిపక్ష సభ్యులగు వైద్యవర వేంకటరాజన్న అవధానిగారు మద్యపానమువలన కలుగుచున్న అనర్థములు వివరముగా ప్రజలకు బోధించ ప్రజలు మానుకొందుమని హర్షపూర్వకముగా ప్రమాణపత్రముపై సంతకముల చేసిరి. మద్యము పైతానుపుట్టిదనియు, ప్రభుత్వమువారు ప్రజలనుండి యీ దురభ్యాసమును సౌమ్యపద్ధతులవలన తొలగించుటకు బూనుకొనివారని రక్షితోద్దేశ్యగాను ప్రజల నుద్బోధించిరి అధ్యక్షులు ఆంధ్రమునందు ప్రజలను కల్లుసారాయి మొదలగు మత్తుపదార్థములను వెంటనే వదలుటకు హెచ్చరించిరి ప్రజలంద రూరేగింపుతో, మద్యపానము వదలుటకు వలయుగీతముల పాడుచు ముసాఫర్ఖానావరకు వెళ్లిరి.

### రేమిడిచర్ల

అభివృద్ధిపక్ష నాయకుల ఆదేశానుసారము స్థానిక గ్రంథాలయపక్షమునుండి ౨ మార్చి తేదీన ఉదయము నగరసంకీర్తన మొనర్చబడినది గ్రంథాలయ కార్యదర్శిచే విరచితమైన గేయముల పాడుచు యువకులు, బాలబాలికలు హరిజనవాడకేగి మద్యపానము విసర్జించుటకు వారల ప్రోత్సాహపరచిరి. సాయంకాలము ప్రజలు, ప్రముఖు లూరేగింపుతో గ్రామవీధులసంచరించి మైదానమునందు సమావేశమైరి ప్రజలకు మద్యపానమువలన కలుగు అనర్థములు, దుష్ఫలితములు చక్కగాబోధించ సుమారు ౧౦౦ మంది త్రాగమని ప్రమాణమొనరించిరి.

### గాలిపల్లి

౨ మార్చి తేదీన జిల్లా ఆంధ్రజనసంఘమువారి యాజమాన్యమున యువకులందరు మద్యపానము మానుటకు వలయుగేయముల పాడుచు గ్రామమునందు ప్రబోధము సలిపిరి. మధ్యాహ్నము శ్రీహనుమంతరెడ్డిగారి అధ్యక్షతక్రింద బహిరంగసభ సమావేశమయినది. శ్రీయుత రామరెడ్డి, జవారిపేట వాస్తవ్యులగు శ్రీకృష్ణారెడ్డి మల్లయ్య గుప్తగారలు మద్యపాననష్టములు వివరములు ప్రజలకు బోధించిరి, శ్రీచద్దంరెడ్డిగారు గౌరవభంగము, ద్రవ్యనష్టము, దారిద్ర్యము, పాపహేతువు అను విషయములపై సుపన్యసించిరి ప్రజలు మద్యపానము మానుకొనుటకు నిశ్చయించిరి

### బెజ్జంకి

పాపయ్యపంతులుగారుదయమున ప్రజలకు మద్యపానమువలన కలుగుచున్న యిబ్బందులు బోధించిరి, సాయంత్రము వీరి అధ్యక్షతక్రింద సమావేశమైన బహిరంగసభయందు శ్రీయెల్లారెడ్డి, బలరామరెడ్డి, నరసింహారెడ్డిగారలు ప్రజలకు మద్యపానము నుద్బోధించిరి, ప్రజలు మానుటకు నిశ్చయించిరి.

### గౌరాయపల్లి

ఇది రాయగీజుతాలూకా (సాలార్జంగుస్టేటు) లోని గ్రామము. ఈ గ్రామపు అబ్కారి ఆదాయము కం॥ ౬౦౦ రూప్యములు. జనసంఖ్య ౧౩౦౦, ప్రజలు యీ కల్లుపిశాచమునకు గురియగుటవలన తోబాతోబా అన్నమో రామచంద్రాయను స్థితికి వచ్చుచుండిరి ప్రజలకు దీనివలన కలుగుచున్న అనర్థములు యువకులేగాక గ్రామాధికారులు సహితము చక్కగా యుపదేశించిరి, ప్రజలకు విషయము చక్కగా బోధపడినందున మద్యపానము పూర్తిగా మానివేసిరి ప్రజలయందిది చక్కగా నాటుకొనుటకు అభివృద్ధిపక్షమువారు యీవిషయమైన ప్రకటించిన పాటలు, పొత్తములు అనేకు ఓప్పాఖానాద్వారా బంపగలందులకు వ్రాసినటుల తెలియుచున్నది.

### బాల్కొండ

ఇది జాగీరుగ్రామము ప్రజలు హెచ్చుమన్నవలన క్రుంగిపోవుటయేగాక మద్యపాన దురభ్యాసము వలన మరింత హీనస్థితికి వచ్చుచుండిరి అభివృద్ధి పక్షమువారి అజ్ఞానుసారముచ్చట మద్యపాన నిషేధప్రచారము విరివిగా జరుపబడినది యువకులు నిషేధగీతముల పాడుచు నూరేగింపుతో వాడవాడలు తిరిగి ముఖ్యముగా హరిజనులవాడకేగి ప్రబోధము సలిపిరి. ప్రజలు మానుటకు ప్రమాణములొనర్చిరి

### సదాశివపేట

శ్రీ బచ్చువేంకటేశ్వరగుప్తగారు గ్రామమందలి చాకల, కుర్మ, గొల్ల, హరిజనుల నొకచో జేర్చి మద్యపానము త్యజించుటకు బోధించిరి

సాయంత్రము నాలుగుగంటలకు విద్యార్థులు, ఉపాధ్యాయులు, స్థానికాధికారులు ప్రబోధగీతముల పాడుచు ముఖ్యవీథులలో సంచరించిరి ఉపన్యాసముల ద్వారా ప్రబోధము కలిగించిరి.

సంగమేశ్వర దేవాలయమునందు జరిగినసభయందు పద్మశాలీయులు మద్యపానము త్యజించుటకు ప్రమాణము లొనర్చిరి వ్యతిరేకించువారు పంచాయతీసంఘముల తీర్పులకు బాధ్యులగుదుమని విశదపరచిరి.

ఈయుద్యమము యింతటితోనేగాక ప్రభుత్వమువారు శాసనరూపమున దీనిని సరికట్టిన ప్రజలకెంతయో లాభము కలిగితీరునని అనుకొనుచున్నారు.

### సిరిసిల్ల

అభివృద్ధిపక్షమువారి ఆదేశానుసారము మద్యపాన నిషేధప్రచారము జయప్రదముగా జరిగినది. చీకోడు, నామాపురము, మున్నగుగ్రామములలో సహితము మద్యపానము పూర్తిగా అగిపోయెను. ఇంచుమించుగా కల్లుకొట్టులు మూసివేయు స్థితికివచ్చెను కాని గౌడులు తహసీల్దారు, అబ్కారి అధికారులకు ప్రజల మద్యపాన నిరసనమువలన అపారనష్టము వాటిల్లుచుండినటుల తెలుప పైఅధికారులు నామాపురము గ్రామాధికారులకు రు ౧౦ ల జుర్మానావిధించిరి ఇంతేగాక మద్యము ప్రజలు తప్పకత్రాగవలయునని అధికారులనుండి చాటింపబడుచున్నది. దీనివలన ప్రచారమునకు అడ్డు యేర్పడుచున్నది అబ్కారివారికి అధికారములేకున్న నిర్బంధముగా ప్రచారకులపై జుర్మానాలువిధించి వసూలుచేయుచున్నారు కావున యీవిషయమున అభివృద్ధిపక్షమువారు ఆలోచించి యిట్టి అన్యాయములు జరుగకుండుటకు ప్రభుత్వమువారినుండి కట్టుదిట్టములు జరిపించి ప్రచారమును సాగించునటుల జేయవలయును

### బొందుగుల

ఇదివరకెయీ (సాంతమునందు) శ్రీనారాయణరెడ్డి గోవిందరెడ్డి, లక్ష్మీనరసింహారెడ్డిగారి కృషివలన మద్యపాన మాగిపోయినది. తిరిగి ౨ మార్చిరోజున యూరేగింపుతో తీవ్రముగా ప్రచారము చేయబడినది ప్రజలు మానుకొనుటచే గౌడులు ఎట్టికల్లని పుచిలముగా కొందరికి బలవంతముగా పోయుచున్నారు అయినను త్వరలో యిచ్చటకొట్టు మూయబడు చిహ్నములు గోచరించుచున్నవి

### దవకుంట

పైమహాశయుల ప్రబోధమువలన ప్రజలు కల్లుత్రాగుటకు పూర్తిగామానిరి కాని ముస్తాజరులు గ్రామాధికారులను లోబరచుకొని వారి యొత్తిడివలన తిరిగి మద్యపాన ప్రచారము జరిగించుచున్నారు

### రుద్రారము

ఇది రాజాపేట సంస్థానపుగ్రామము. ఇదివరకే మద్యపానము నిర్మూలమైయుండెను. గ్రామాధికారుల మాయోపాయములచే తిరిగి ప్రారంభింపబడినవ్వటుల గలదు. హరిజనులుమాత్రము పట్టిన పట్టుకు వదలమని సంకల్పించియున్నారు

### జూలూరు

శ్రీలక్ష్మణసింగు, కృష్ణారెడ్డిగారల నిరంతర కృషివలన ప్రజలు మద్యపానము చాలవరకుమానిరి ఆదేశానుసారము ౨ మార్చి తేదీన మేళతాళముతో గీతములుపాడుచు ప్రచారము సలుపబడినది ఇది మ. మహమూదలీగారి జాగీరు గ్రామము శ్రీ బొందుగుల నారాయణరెడ్డి, గోవిందరెడ్డి, లక్ష్మీనరసింహారెడ్డిగారలు ప్రజలకు కల్లుత్రాగుట మానుటకుబోధించిరి గ్రామమునం దధికసంఖ్యాకులు మానుటకు బూనుకొనిరి

### పాముకుంట

శ్రీ నారాయణరెడ్డి, లక్ష్మీనరసింహారెడ్డి ప్రభృతులు ప్రచారార్థమిచ్చటి కరుదెంచి ప్రజలకు మద్యపాన నిషేధముగూర్చి బోధించిరి శ్రీ చంద్రారెడ్డి, నరసింహారెడ్డి, జమాలొద్దీన్‌గారు మద్యపాన నిషేధముకై పట్టుదలతో కృషిసలుపుచున్నారు. ప్రజలు చాలావరకు దురభ్యాసమును తొలగించివేసిరి పాఠశాలలేని కొరతమాత్రము యీగ్రామమునకు చాలాగలదు.

### కొలనుపాక

ఫిబ్రవరి చివరవారమునుండియే హరిజనబాలుర, ఉపాధ్యాయులు చక్కని గీతములబాడుచు మద్యపాన నిరసనముకై గ్రామమునందు ప్రచారము గావించుచుండిరి అభివృద్ధిపక్షమువారి ఆదేశానుసారము ౨ మార్చిరోజు గ్రామాధికారులగు శ్రీ రంగారావు, లక్ష్మణరావు ప్రభృతులు, బొందుగుల నారాయణరెడ్డి ప్రభృతులు గ్రామమంతటను యూరేగింపుతోతిరిగి ప్రజలను కల్లుసారాయి మానుటకు ప్రబోధించిరి. ప్రజలలో ప్రబోధము కలుగుటవలన కల్లు విక్రయింపబడుటలేదు. గౌడులు నియమమునకు విరుద్ధముగా వనములందు కల్లు విక్రయించుచున్నది పోలీసు, అబ్కారివారికి తెలుపబడినది. శ్రీ రాజరెడ్డి వకీలుగారు ప్రజలకు కల్లుమూరు పావకముపోయించుటకు ౪ మణుగుల బెల్లము యిచ్చిరి. ప్రజలు మద్యపానము మానుటకు నిశ్చయించిరి

# ఆంధ్ర నాయకులపై పోలీసువారి నిగ్రానియా?

## గౌడుల దౌర్జన్యము

పెద్దల తీర్పు

(గోలకొండ విలేఖరి)

భువనగిరి మార్చి, ౧౫

అభివృద్ధిపక్షమువారి ఆజ్ఞానుసారము యువకులవలన జరుపబడుచుండిన మద్యపాననిషేధ ప్రచారముతో ప్రజలు మత్తుపదార్థము లుపయోగించుమని కట్టుదిట్టములు జరుపుకొని తదానుకూలముగా ప్రవర్తించుచుండిరి కాని కల్లు వ్యాపారమునందు ప్రజల ఏకనోనిశ్చయముతో అపారనష్ట మేర్పడుచుండుటచూచి భరించలేక గౌడులు దౌర్జన్యమునకు గడింగి ప్రచారసల కొట్టిరి ఈవిషయము స్థానిక మద్యపాననిషేధ సంఘమువారికి తెలియగనే గౌడుల పిలిపించి మందలించ వారు తప్పునుగ్రహించి క్షమాపణ గోరిరి తిరిగినిషేధప్రచార మారంభమయ్యెను.

గౌడులు తమయెత్తులు ఫలించకపోయెనని దిగులొందక క్రొత్తపథమేదో యవలంబించిరి. దీనివలన క్రమముగా నిషేధకార్యము'మగ్గిపోవు చున్నది, ఇంత ఆకస్మిక మార్పుకు కారణము విచారించ నిషేధసంఘమందలిపెద్దలగు గోపాలరెడ్డి వకీలు, అబ్దుల్ రహమాన్ వకీలుగారలు ప్రచారకుల పిలిపించి గౌడులకు నష్టము కలిగించుట భావ్యము గాదనియు, యిష్టములేకుంటే మీరు స్వయముగామానుట యుత్తమముకాని యితరులవద్దనుట మంచిదిగాదని హెచ్చరించినటులను, ముందిట్టి కార్యములు జరుపకుండుటకు ప్రచారకులనుండి యొకరారునామాలు వ్రాయించుకొనినటుల రూఢిగా తెలియుచున్నది. పెద్దలతీర్పు లిటులేయుండు నేమో!

ఈ మద్యపాననిషేధ ప్రచారమునకు నగరమునుండి ఆంధ్రనాయకులురానున్నటుల సంఘసభ్యులగు కేశవర్సయ్యగారు అబ్దుల్ రహమాన్ గారికితెలుప "మనకు వారితో సంబంధములేదు, అందువలన వారికేవిషయమున సాయపడగూడదు ఈవిషయము వెంటనే పోలీసుకు రిపోర్టుచేసి వారిపై నిగ్రానియుంచుటకు పోలీసువారిని కోరుట మనకర్తవ్యము"ని విశదపరచినటుల తెలియుచున్నది

## మొహర్రం దురంతము

(గోలకొండపత్రిక)

భువనగిరి మార్చి ౧౫

౧౧ మార్చి రాత్రి రెండుగంటలసమయమున వైశ్యవీథియందల్లాడి నారాయణగారి గృహావరణమున యెడ్లబండియుండెను. మొహర్రం సందర్భమున తరచుగా ఈబాడయుండే దౌర్జన్యములు జరుగుచుండుటచే బండియజమానిబండి వానినిబండియందేపడుండబెట్టెను. ౧౦–౧౫మంది మహమ్మదీయులాసమయమున గల్లంతు చేయుచువచ్చి బండిని అలావాలో వేయుటకు మొదలిడిరి బండివాడులేచి మందలించ దుండగీండ్రులు లాఠీలతో బండివానిని చావమోదిరి. అంతట చుట్టుపట్టువారలు మేల్కొని రాగా దుండగీండ్రు పలాయనులైరి ప్రజలు పోలీసు సబ్ ఇన్స్పెక్టరుగారికి మహమ్మదీయుల దౌర్జన్యమును దెలుప వెంటనే వారచటి కరుదెంచి విషయము పరిశీలించిరి, తగినశిక్ష యొసంగెదమని సెలవిచ్చిరి. కాని యింతవరకేమియు లేనటుల ఆవాడవారనుకొనుచున్నారు.

మహాకార్యమునకు స్వయముగా పటేలుగారు పూనుకొని ప్రయత్నించుచుండుట యితరులకాదర్శప్రాయముగా గలదు దీనివలన గ్రామమందలి కల్లుకొట్లు పూర్తిగా మూసివేయబడెను ప్రజలు యించుమించుగా యీ దురభ్యాసమును మానుకొనిరి

ఆదేమిదురదృష్టమోగాని గౌడుల నేక మాయోపాయములుసలిపిరి, ఏదియు ఫలించలేదు. కాని వీరు పటేలుగారిని యెటులనో సమాధానపరచుకొనుటచే తిరిగి మద్యపానము యథాప్రకార మేర్పడుచున్నది.

## పటేలుగారి సమాధానము ప్రజల సర్వనాశనము

(గోలకొండ విలేఖరి)

బసవాపురం, మార్చి ౧౪.

ఇది భువనగిరికి రెండు మైళ్ల దూరమునగల గ్రామము. ఇచ్చట యువకుల ప్రచారమువలన మద్యపాననిషేధము విజయవంతమయ్యెను. ప్రజలలో చక్కనిప్రబోధ మేర్పడుట చూచి యీ

## దుండగీయుల దౌర్జన్యము

గోలకొండ విలేఖరి] పాదపల్లి, మార్చి ౧౫,

ఇది భువనగిరి తాలూకాలోని గ్రామము. ౧౦ మార్చి తేదీన గ్రామమందలి వ్యవసాయకులు కొందరు చావుడివద్ద కూర్చొనియుండగా కొందరు మహమ్మదీయులు వచ్చి వారల అలావా ఆడుటకురమ్మన వారు నిరాకరించిరి, అంతట భరించలేక దుండగీయులు వారలలో కొకరినికొట్టిరి పెద్దమనుష్యులు కొందరు వారల విడిపించిరి అంతట దుండగీయులు కత్తులు, కర్రలతోవచ్చి వారిని పొడిచివేతుమని బెదరించిరి. గ్రామమునందు గల్లంతు జరుగుచుండుటచే వెంటనే పోలీసుపటేలువచ్చి యుద్ధయుల శాంతిపరచి విషయము పోలీసుకు రిపోర్టుచేయబడినది పర్యవసానము చూడవలయును.

## ఆకస్మిక దుర్మరణము

(ఒకవిలేఖరి) మధిర, మార్చి ౧౫,

ఈ తాలూకాలోనుండలి చంద్రగొండ్రయందొక వైశ్యస్త్రీ సంతానాపేక్షితయై కొర్లగొండ గ్రామమునందు వెలసియున్న శ్రీ గోపాలస్వామి దర్శనార్థమేగెను. దురదృష్టవశమున స్వామిసన్నిధికి చేరగనే దుష్టగ్రహావేశయై వెంట్రుకలువిరయబోసుకొని ప్రలాపించమొదలిడెను. వెంటనే యింటికి తీసుకరాబడెను. ప్రతిఆదివారం అన్నపానములువదలి మూసుచుండెను. ఎవరువిచారించ" నేను తోటికోడలును. వచ్చేవారం యీమెను బలిగొందును. తర్వాతను యీపెద్దదాని" చెప్పెను. చివరకు గతఆదివారం రాత్రి అందరు నిద్రించుసమయమున ఆస్త్రీ గృహప్రవేశయై సమీపమందలి బావిలో పడినది. మృతిజెందినది రక్షకశాఖవారి పరిశీలనానంతరము కూతురువలన దహన సంస్కారములు జరుపబడినవి.

## లేఖలు

సికింద్రాబాదు నివాసులగు శ్రీ శేషాద్రి సత్యనారాయణగారికి:—

సోదరా,

కొంత మెత్తవలేక యుండినందువలన హైదరాబాదు, సికింద్రాబాదు పట్టణములందు ఆర్యులకుండు ఎక్కువగా నున్నందున యుంటేం కేగి విన్నవించ వ్యవధిలేకుండెననియు మనవి చేయుచున్నాము. కాని ఆర్యసంఘమువారు కళ్ళతో సికింద్రాబాదు నందు మార్కెట్టు వీధియందుని ప్రచార మొనర్చియున్నారు. వైశ్యకులమున ఉద్భవించిన ప్రతివ్యక్తియు మాను గ్రాహ్యమేయని విన్నవించుచూ పాంథిక కార్యములయందు తల దూర్చనివారైన పాల్గొనవచ్చునని మన వి చేయుచున్నాము. మాచే గావింపబడిన పత్రిక ప్రకటనను, బందోబస్తు యతికించిన పత్రికలను పరికించినట్లైనను, సికిందరాబాదు నివాసియగు శ్రీ టి.సి.వి. గుప్తగారు ఆయా చిరకముగనే ఆర్యసంఘ సభ్యులుగచేరి మనసభలలో పాల్గొని తమకర్తవ్యమును నెరవేర్చుకొనిరని తమ కుదాహరించుచున్నాము.

ఇనియును గాక కరపత్రములు, ఆహ్వానపత్రములు విరివిగా పట్టణమంతటను అంటించబడెను. తీర్మానములు, నివేదికయు ప్రచురింపబడెను ప్రచురించిన తరువాత తమకు పంపెదము. ప్రతివైశ్యునియందు తమకుగల కులాభిమానము వల్లనే మన సంఘము కొలది కాలములోనే యభివృద్ధిపొందగలదని నమ్ముచున్నాము. శక్తి మించిన ప్రచారము చేసియేయున్నామని విన్నవించుచూ తమ ౧౮—౨—౩౮ తేది గోలకొండ ప్రకటనకు సమాధానము నుపసంహరించుచున్నాము,

ఇట్లు

వేలూరు వీరభద్రయ్య.

## మద్యపాన నిరోధము, ప్రజల నష్టము

హైదరాబాదు మద్యపాన నిరోధక సంఘము మూలముగ మద్యపాననిరోధక దిన ఫలితముగ నిజాంరాష్ట్రములో ప్రత్యేక శాసనము అవసరమని లేకుండనే ప్రజలలో మంచి సంస్కరణ జరిగినట్లు వినుటకు చాలా సంతోషించవలసి యున్నది. అభివృద్ధిచేయువారి కార్యక్రమము ప్రారంభించుటలోనే శుభ సూచకములు కనుపించుచున్నందుకు చాలా ఉత్సాహము కలుగుచున్నది. కాని ప్రత్యర్థుల దుష్ప్రచారము కూడా అనుకొంటకన్నా ఎక్కువగా ఉన్నది. అప్రత్యర్థులు దీనినుండి లాభము పొందకపోయినను అనవసర వ్యయమును ప్రయాసయు సరికొనవలసి వచ్చుచున్నది. ప్రభుత్వపక్షమున కూడా ప్రచారము చేయుటచే ఆప్రత్యర్థుల దుష్ప్రచారము ప్రజలు గ్రహించి దీనిలో మద్యమునువర్జించుచున్నారు. కాని అబ్కారీశాఖకు చెందిన ప్రభుత్వోద్యోగులు తప్పని సరిగా త్రాగవలెనంటూ గ్రామాలలో డబ్బు చాటించుచున్నందున, ప్రభుత్వము వారే త్రాగవలెనంటూ, ప్రజలకు ఏమీ తోచుటలేదు. గొయ్యి, నుయ్యి రెండు వరసాగివున్నవి.

ఇదిఇట్లుండ కల్లుత్రాగని కారణముచే కల్లు తీసే తీసుకపోవుటకు వీలులేదు. గ్రామములో త్రాగువారులేరు. తత్ఫలముగా కల్లు పారబోయవలసి వస్తున్నది. దీనిచే గౌండ్లవాండ్లకు తీర నష్టము సంభవించుచున్నది. కాని ఎన్ని కష్టములైనను అనుభవించుచు ప్రభుత్వముతో మొరపెట్టుకొన సాహసించని రైతులవలె గౌండ్లవాండ్లుకూడా భయములో ప్రభుత్వముతో ఇంతవరకు ఏలాంటిమొఱ పెట్టుకొనవటములేదు. ఈనిషేధ ప్రచారకులు గౌండ్లవాండ్లకు చేదోడు వాదుగానుండి వారికష్టములను ప్రభుత్వమువారికి నివేదించుకొను శక్తి కలిగించవలెను. కృషిచేసి వారికి సరియైన న్యాయము లభించుటకు ప్రయత్నించవలెను. ఈవిషయములో నిరోధక సంఘమువారి అభిప్రాయమేమి? వారు ప్రమాణపత్రములు తీసికొనుటకు కారణమేమి? వెంబడి జరుగునవి తెలిసికొనవలెను. లేదేని నిషేధప్రచారమువలన కలుగులాభమునకంటె నష్టము హెచ్చుగా సంభవిస్తుంది, ప్రచారముపైని ప్రజలకు భక్తివిశ్వాసములు తగ్గును. శాసనములేకనే మద్యమును విసర్జించిన రైతులు శాసనరీత్యా జప్తు చేస్తే అవస్థలు తొలగించవలసియుండును. కావున అభివృద్ధి పక్షమువారు గౌండ్లవాండ్లకు చేదోడుగా కృషిచేసి వారికి సరియగు న్యాయము చేకూర్చుటయందును, ప్రభుత్వమువారు తమ పాలసీని విపులముగా తెల్పియు, మద్యపాన నిరోధక సంఘమువారు తమ కార్యక్రమమును ప్రకటించియు ప్రజలను కాపాడగలరని నమ్ముచున్నాను.

—సునీతుడు

## మట్టిపాత్రలలో వంట ఆరోగ్యకరమైనది!

లోహపాత్రలచే విషము

"భారతదేశమందు అనేకచోట్ల ఇతరదేశముల క్రింద అనుసరించబడుచున్న అనారోగ్యమునకు కారణము, ప్రత్యక్షముగనో, పరోక్షముగనో వంటకును, భోజన పదార్థముల నుంచుటకును ఆలోచనలేకుండ లోహపాత్రల నుపయోగించుటచే కలుగుచున్నదని సూచించుటకు ఆధారములు అంతకంతకు హెచ్చుచున్నవి. లోహపాత్రలతో సంయోగముచే కలుగు ఉపద్రవములను, తత్ఫలితముగ సంభవించు దుష్ఫలితములను దక్షిణదేశములో ఎక్కువ ఇక్కడ ఎక్కువగా చెప్పవచ్చును, ఎక్కువపులుపు పదార్థములను చాలమంది వాడుచుందురు" అని బెంగుళూరులో "ఇండియన్ సైన్సు ఇన్స్టిట్యూటు" నందు బయోకెమిస్ట్రి ప్రొఫెసరగు డాక్టర్ వి. సుబ్రహ్మణ్యంగారు ఆర్. వి. అయ్యరత్నంగారు వ్రాసిన "ఆరోగ్యమునకు మట్టిపాత్రలు, మట్టిపాత్రల గృహపరిశ్రమ" అను ఒక చిన్న విజ్ఞానదాయకమైన పుస్తకమునకు పీఠికలో అనుచున్నారు.

వారు గావించు లోహపాత్రలన్నిటిని పులుపుపదార్థములు కొంతకరిగించును. ఇత్తడిపాత్రలపై పూయబడు కళాయి లోటుగుణమింకను హెచ్చు. తగరము అనుకున్నము, దానితో చేరియుండు (ఒక్కొక్కప్పుడు ప్రతిశత ౫౦పాళ్ల వంతువరకుండు) సీసము అంతకన్నను విషము. అల్యూమినియము, తవంతట, అంతవిషము కాకపోవచ్చును, కాని త్వరలో కొట్టివేయబడు గుణముగలది. మరియు ఆపాత్రల నుపయోగించుటవలన ఆహారపదార్థములలో ధాన్యరసము లభించకుండ పోవుచున్నది.

"లోహపు సంబంధమైన విషమునకు వాంతి వచ్చుట మున్నగులక్షణములు కనిపించవలెనను ఒకఅభిప్రాయము వ్యాపించియున్నది. అట్టి ఫలితము రాగి, తుత్తినాగము విషమువంటి గొప్పవిషము ఎక్కువైనచో కనిపించును. తక్కువ లోకవిషముల లక్షణములుగాని వెంటనే బయటికి కనిపించక పోవచ్చును. విషములు శరీరములోనుండి వెడలిపోవచ్చును, కాని మనుష్యుని ఎదుగుబొదుగులయైనను, శక్తియైనను దానిఫలితము స్పష్టముగా కనిపించును. ఉదాహరణముగ అప్పుడుపుట్టిన ఎలుకలకు కొన్నింటికి సాధారణముగా దక్షిణ హిందూదేశములో కళాయిచేసిన ఇత్తడిపాత్రలలోనో లేక చౌకరకముపాత్రలలోనో వండబడిన ఆహారము, మరికొన్నింటికి అదే ఆహారము, గాజుపాత్రలలో తయారుచేసియు ఇచ్చిచూడగా మొదటితరగతి ఎలుకలు రెండవ తరగతివాటికంటె చాలతక్కువ బరువు కలిగి చాలతక్కువ కాలము జీవించినవి."

## పెట్టని దీపాలు

- కాయకష్టమువల్ల జీవించే నిరుపేద కుటీరాలలో—
- సిరిసంపదల తులతూగేవారి ఉన్నత సౌధరాజాలలో—

### స్త్రీలే పెట్టనిదీపాలు

అందువల్లనే

- స్త్రీల ఆయురారోగ్యాలు
- స్త్రీల అందచందాలు
- స్త్రీ ముద్దుమురిపెములు

అంతముఖ్యం

కర్యాకరణ రోగనివారిణితో ఆయురారోగ్యాలు
పసుపు కుంకుమవర్తితో అందచందాలు
సంతానముతో ముద్దుమురిపెములు చెల్లించాలి

### "లోధ్ర" సేవిస్తే

ఆరోగ్య దీపకము
సౌందర్య పోషణము
సంతానోదయము

తథ్యం తథ్యం తథ్యం

"లోధ్ర" అన్ని మందుల షాపులలోను దొరుకును

కేసరి కుటీరం

రాయపేట :: మద్రాసు

## హిందూమతమునకు దురదృష్టకాలము

"నేడు బాలిదీవులలో జనులు ఆధ్యాత్మిక సహాయమునకై భారతదేశముపైపు చూచుచున్నారు. భారతమాత చేయిచ్చి సహాయపడి నశించుచున్న బాలిజాతిని సంరక్షించునా?" అనిరంగా స్వామి పానిగావు బాలిదీవిలో హిందూ మతాభివృద్ధినిగూర్చి "త్రివేణి"లో ఒక వ్యాసమందు అడుగుచున్నారు.

బాలిదీవిలో ఇండోనీసియన్ దీవులలో మంచిప్రకాశవంతమైన రత్నము. ఆదీవియందు క్రీస్తుశక ప్రారంభములో హిందువులు పోయి కాపురమేర్పరచుకొనిరి. కాలక్రమమున దక్షిణహిందూ దేశమునుండి కొందరు వైదిక బ్రాహ్మణులు క్రీ. శ ౧౫౨౦ లో మజపహిత్ సామ్రాజ్యము విచ్ఛేదమగుటకు ముందు జావాలోదిగి, తర్వాత వెంటనే బాలిదీవికి వచ్చి పోవుటచే ఆ దీవిలో హిందూ మతమునకు బలము కలిగెను. బాలి బ్రాహ్మణులు నేడు తాము వాహురావుత్ సంతతియని చెప్పుకొందురు. అతనికి అయిదుగురు భార్యలున్నట్లు చెప్పుదురు. ఇపుడు బాలిజాతీయులలో నున్న అయిదుశాఖలును ఆ అయిదుగురు భార్యలనుండి పుట్టిన సంతతియని చెప్పుకొనబడుచున్నది.

బాలి హిందూమతములో నొకగొప్ప లక్షణమేమనిన, ఆదిదేశకాలపాత్రల కనుగుణముగ సాగుచుండును. బాలిలోగూడ వర్ణభేదము లున్నను, అవి భారతదేశములో నున్నట్లు కఠినముగలేవు. నేడు బాలిదీవిలో హిందూమతము సహజమైన సౌభాగ్యముతో స్వచ్ఛముగ నున్నది.

వేదములలో కొన్ని భాగములును, బ్రహ్మాండ పురాణమును హిందూ ధర్మమునుగూర్చి ఆ దేశమాలైన ఇతర సంస్కృత గ్రంథములును, ఆ దీవిలోనున్నవి. పశ్చిమ జావారాజుల కును తూర్పు బాలి రాజులకును జరిగిన యుద్ధములు కాని, బౌద్ధమతము గాని ఇక్కడ హిందూమత ప్రాబల్యమును కోర్చలేక పోయినది.

ఇట్లు హిందూ మతాదర్శ ప్రేరితులైన బాలి ద్వీప వాసులలో ప్రపంచపు మార్పులచేగాని, రాజ్యముల అభివృద్ధి పతనములచేగాని మార్పు చెందక ఒకనూతన సంస్కృతి-౧౦౦౦-ఏండ్ల కాలము వికాసమునొందెను. ఇట్లు పాశ్చాత్యులు దోపిడికిని, లాభమునకును, ముడిపదార్థముల కొరకును ప్రాగ్దేశములలో ఆడుగుపెట్టుటకు జరిగెను. మొదట వ్యాపారమునకు వచ్చినవారు రాజ్యములను స్థాపించిరి. తర్వాత మిషనరీలు కూడబయలుదేరిరి. వారి ఒత్తిడిక్రింద దాదాపు ఇండోనీసియాలో జాతులన్నియు క్రైస్తవమతములో చేరెను. ఒక్క బాలిదీవిమాత్రము పూర్వమతమును వదలుటకు నిరాకరించెను.

కాని ఇపుడు క్రైస్తవ మిషనరీలుగుంపులుగుంపులుగవచ్చుచున్నారు. బాలిప్రజలు తమమతము కొరకై పోరాడుచున్నారు. ప్రాణత్యాగము చేయుటకుగూడ సంసిద్ధముగనున్నారు. కాని పాశ్చాత్యులకు గల సాధన సంపత్తియెదుట వారిబలము నుపయోగించజాలక పోవచ్చును..అనేకములైన ప్రతికూల పరిస్థితుల మధ్యపట్టుదలతో వెలుగుచుండిన ఆహిందూమతజ్యోతి ఆదీవిలో నేడుగొప్ప ఉపద్రవము నెదుర్కొనుచు వినాశమునకు భయపడుచున్నది. భారతదేశమేమిచేయును?

### చికిత్సలేని రోగమేలేదు

క్షయ, హిస్టీరియా, మధుమేహము, శ్వాసము, పక్షవాతము, పురుషత్వహీనము మొదలగు రక్తవీర్య సంబంధ రోగములు గ్యారంటీగా కుదుర్చబడును.

ప్రొఫెసరు జి. పి. శాస్త్రి
రాజవైద్యులు.
యస్.ఏ., ఏ.వి., బి.ఆర్.,
మురళీధర్ బాగ్, హైదరాబాద్.

### అంబికా జ్యోతిషాలయం

జననకాలము, తేది, స్థలము, పేరు వ్రాసిన మీజీవితములో యిటుపై సూచిగా జరుగు సహేతుక పూర్ణ ఫలములతో జాతకము వ్రాసి వి.పి.గా పంపుటకు

రు. 2—8—0

కొప్పల్లి శ్రీనివాసరావు
శ్రీవైష్ణవ అగ్రహారము
గద్వాల

పజా సామాన్యమునకు

పరిపాలనాధికారము కలుగుటయే

## భారత విప్లవోద్దేశము

నాసిక్ మార్చి (టపా)

"ప్రస్తుతము భారతవర్షమొక యస్థిర యుగమునుండి గడచుచున్నది. రైతులలో క్రయశక్తి—Purchasing power అభివృద్ధిగాంచుట త్వరపరము. వారిభూములు వారి కప్పగించుటయే ప్రథమ కర్తవ్యము"ని యం. యన్. రాయిగారు నాసిక విద్యార్థిసంఘ యాజమాన్యమున జరుపబడిన బహిరంగసభయం దుపన్యసించిరి. రాయిగారికి స్టేషనుయందు పై సంఘమువారు నగరకాంగ్రెసు సంఘమువారు ఘనముగు స్వాగతమొసగి నగరవీధులనుండి యూరేగించిరి.

సాయంకాలము వీరి గౌరవార్థమై సమావేశపరచబడిన బహిరంగసభయం దుపన్యసించుచు "ఈ మహాకార్య సాధనమునకు రాజకీయ విప్లవ మత్యావశ్యకము, అన్నివిధముల అణచియుంచిన జనసామాన్యమునకు, రైతులకు రాజకీయాధికారము యీ విప్లవమువలన యేర్పడవలయును. కాబట్టి దేశమందలి విద్యార్థులు విప్లవిక చిహ్నములను గమనమొనరించుకొని తదానుకూలముగా ప్రవర్తించుటకు కృత నిశ్చయులు కావలయున"ని ప్రజల యుద్బోధించిరి.

## జ్వరముతో బాధపడు వారికి క్రొత్త ఆశ

జ్వరముతో యున్నప్పుడును, జ్వరము నయమైన తరువాతియున్ను, ఆహారముమాట తలచిననే అసహ్యముగా యుండును.

అయినప్పటికి జ్వరవిషముచే బలహీనతచెందిన మీశరీరమునకు అత్యంతబలకర ఆహారమవసరము.

డాక్టర్లు హార్లిక్సు చాల సులభముగా జీర్ణమైన ఆకలినికలిగించి, శరీరబలమును త్వరలో అభివృద్ధినొందించునని కనుగొనియున్నారు. జ్వరాశక్తత కాలముతగ్గి త్వరలో శక్తి చేకూరును.

యీరోజే హార్లిక్సును కొనండి.
అంతటా దొరుకుతుంది.



### గోలకొండపత్రిక విడిప్రతుల విక్రయ కేంద్రములు

హైదరాబాద

1. గణపతిభవన్, అబిదురోడు.
2. గులాందస్తగీర్ బుక్సెల్లర్స్, నిజాంహోటల్.
3. భారతి వస్తుభాండార్, సుల్తాన్‌బజారు, చావుడి.
4. ఆంధ్రశ్రీకంపెని, రాంకోటు.
5. కే.వి. వీరేశంగారు సుల్తాన్‌బజారు
6. కర్నాటక న్యూస్ ఏజన్సీ ఇసామియాబజారు
7. చందానారాయణశెట్టి బుక్ సెలరు, చార్‌కమాన్.

సికింద్రాబాద

1. ఇ. నర్సింలు, న్యూస్ యేజెంటు, 108 జేమ్సుస్ట్రీటు. —చీఫ్ ఏజంటు.
2. శ్రీరామా బుక్ డిపో మార్కెట్టుస్ట్రీటు.